శ్రీ శివాభ్యాన్నమః

# శ్రీ శివపురాణము

శ్రీ ముదిగొండ నాగవీరేశ్వర కవి

విరచితము



శ్రీ కింకవీంద్రఘటాపంచాననేత్యాది బిరుదాంచితులు శతావధానులునగు

బ్రహ్మశ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రుల వారిచే

పరిష్కృతము

<u>పంచమ ముద్రణము</u>

మారుతి పబ్లికేషన్స్

**43 వెస్ట్ మారేడుపల్లి, రోడ్‌నెం. 2,**

సికింద్రాబాదు.

వెల. రూ. 275.

పోస్టేజి ప్రత్యేకము

పంచమ ముద్రణము - 1000 ప్రతులు
2000

ప్రాప్తి స్థానము:
మారుతి పబ్లికేషన్స్,
43, వెస్ట్ మారేడుపల్లి,
రోడ్ నెం. 2,
సికింద్రాబాద్ - 500 026.
ఫోన్: 7802508

గ్రంథ ముద్రణకు శ్రీ తిరుమల
తిరుపతి దేవస్థానము వారు మతగ్రంథ ప్రచురణ సహాయము
పథకము క్రింద ధనసహాయమొసంగిరి.

కంప్యూటర్ టైప్ సెట్టింగ్ మరియు ముద్రణ:
హైటెక్ ఎంటర్ ప్రైజెస్ (దీప్తి టెక్నికలర్ ప్రింటర్స్),
సి-15, బాలాజీ టవర్స్, గాంధీ నగర్,
గోల్కొండ క్రాస్ రోడ్స్,
హైదరాబాద్ - 500 020.
ఫోన్ నెం. 7671357, సెల్ నెం. 9849025971.



క. శంకరునిన్ శాంకరినిన్.

శాంకరినిన్ సింధురాస్యు ◆ శైలాదిని ని

శ్శంకన్ గొలిచిన వారికి

సంకటములు సురుఁగు సకల ◆ సౌఖ్యము లమరున్

ము॥ నా॥



కృతిపతులు

శ్రీ ముదిగొండ వీరభద్రారాధ్యులుగారు

వారి ధర్మపత్ని లక్ష్మీదేవమ్మ గారు



కృతిపతులు

శ్రీ ముదిగొండ వీరభద్రారాధ్యులుగారు

వారి ధర్మపత్ని లక్ష్మీదేవమ్మ గారు

# శ్రీశివపురాణము

## పంచమ ముద్రణము

## శివపురాణ ప్రబంధము

### బృహత్ ద్విసహస్రావధాని, అధికార భాషా సంఘాధ్యక్షులు
### బ్రహ్మశ్రీ డాక్టరు మాడుగుల నాగఫణి శర్మగారు, ఎం.ఎ., పి.హెచ్.డి.

పరమ మాహేశ్వరులైన శ్రీముదిగొండ నాగవీరయ్యశాస్త్రి గారు ఆంధ్రీకరించిన 'శివ పురాణం' మహాపురాణమే గాక మహా కావ్యమై, మహా ప్రబంధమై, ధ్వన్యాది మహా పరిమళములను వెదజల్లుతున్నది.

వాఙ్మయ స్వరూపములో వేదం ప్రాచీనము, ప్రబంధ మర్వాచీనం అనుకొనగా అటు వేదము నుంచి ఇటు ప్రబంధము వరకు సర్వ వాఙ్మయ మహా ఫలమును ఈ శివ పురాణాంధ్రీకరణ ఆంధ్ర లోకమునకు అందచేయుచున్నది.

దీనిని స్పృశించని, దీనిపై అభిప్రాయం వ్రాయని - మహా పండితులు కానీ, మహా కవీశ్వరులు కానీ ఆంధ్రదేశమున లేరు అనుట అతిశయోక్తి కాదు. ఎవరి ఫణితిలో వారు, ఎవరి పరిధిలో వారు ఈ శివపురాణాంధ్రీకరణం గూర్చి తమ తమ వాగ్వైఖరిని ప్రదర్శించి తరించినారు. ఈ తరించడం అన్న ఒక్క మాట నాకు కూడా అనువర్తించి దీనిపై నా అనుభూతినో, అభిప్రాయమునో వ్రాసే సౌభాగ్యమును బ్రహ్మశ్రీ మార్కండేయ గారు నాకు కలిగించినారు. మొదట ఇది నా చేతికి అందగానే పురాణమే కదా అనుకొంటిని కానీ ఒక పద్యమును చదువగా ఈ పుస్తకమును ఎక్కడా ఒక్క క్షణం కూడా ఆపలేక రాత్రులు రాత్రులే మొత్తం పుస్తకమును చదివితిని.

ఏదో ఒక భావమును చెప్పడం, ఏదో ఒక విషయమును ఆశ్రయించుకుని కవిత్వం అల్లడం ఒక స్థాయి కవి చేసే పని. కానీ ఒక మహా సముద్రమువలె, ఒక ఆకాశంవలె, ఒక మహా పురుషుని మనస్సు వలె ప్రసన్న గంభీరముగా సర్వ విషయములను అంతర్గర్భీకరించుకుని చెప్పగల వారు మహాకవి పదాభిధేయుడు. శ్రీనాగవీరయ్య శాస్త్రిగారు మహాకవి అనుట కన్న ఒక మెట్టు పైన చెప్పవలె. ఆయన ఒక మహర్షి.

> అరుణ మరీచి యంత నుదయాచల పీఠము నెక్కి సర్వత
> స్ఫురదసమాన మంజుకరపుంజములన్ వెలయించి యూర్ధ్వని
> స్సరదమలాంశుజాలముల శైలవరోన్నత శృంగ పల్వలాం
> తరనళినాళిఁ గూడఁ బ్రమదమ్మునఁ బూయగఁ జేసె వాసిగన్. (పా.ఖం.5-193)

అన్న పద్యము నన్ను మిక్కిలి ఆకర్షించినది. ఇట్లు ఆకర్షించిన పద్యములను చెప్పవలెనన్న అది మరియొక మహాపురాణం అగును. అందువలన నా అభిప్రాయమును ఇక్కడ సంక్షేపించి ఈ పద్యము ద్వారా తెలుపుచున్నాను.

మిహిర శశాంక తారకము మించి రహించెడు దాక - పా
పహరము - పుణ్యభాజనము - భవ్యకథాశ్రయ - మార్యపూజితం
బిహపర సాధకంబగుచు నీశపురాణము; నాగవీరమై
బహుళ పురాణ కావ్య రసబంధుర మిట్లు ప్రబంధ మొప్పెడున్.

మాడుగుల నాగఫణి శర్మ
ప్రమాధి మాఘ బహుళ తృతీయ - మంగళవారం.
**22-2-2000**

---::O::---

శ్రీశైవమహాపీఠాధిపతి ఆచార్య శివశ్రీ నిర్మల శంకరశాస్త్రి ఆరాధ్యులవారు, సికిందరాబాదు

పంచమ ముద్రణాగతమైనందున సుప్రఖ్యాతమైన శివశ్రీ ముదిగొండ నాగవీరేశ్వర శాస్త్రి గారిచే ఆంధ్ర పద్యగద్య సంమిశ్రముగ అనువదింపఁబడిన శ్రీశివమహాపురాణముఁ గూర్చి నాతోచిన ప్రశంస- పరిచయము - అభిప్రాయమున్ను.

శ్రీ శివప్రణీతములై వేదవ్యాససంగృహీతములగు అష్టాదశమహాపురాణములలో నాలుగవదగు శివమహాపురాణము - పురాణవాదము కాగా విష్ణుభాగవతము అనువాద మగుచున్నందున - అనేక సందర్భములయందు భాగవతము శివపురాణము ననుకరించినదిగా కనఁబడుచున్నది.

''శ్రుతి స్మృతీ ఉభే నేత్రే - పురాణం హృదయం స్మృతమ్''

పరమేశ్వరునకు శ్రుతిస్మృతులు నేత్రములు కాగా - పురాణము - హృదయ మగును. కోటిశ్లోకాత్మకముగ పరమేశ్వర ప్రణీతంబైన మహాపురాణ మొక్కటే నుండెను. శివాజ్ఞచే వేదవ్యాసుఁడు - నాలుగు లక్షల శ్లోకములలో సంగ్రహించి - పదునెనిమిది విభాగముల నొనర్చెను. అష్టాదశ మహాపురాణములలో పది పురాణములు మూడులక్షల శ్లోకములలో శివపారమ్యము సాక్షాత్తుగాను, మిగత ఎనిమిదిటిలో విష్ణ్వాది దేవతల ద్వారా శివపారమ్యము నిరూపింపఁబడినది.

పురోవాదానువాదముల విధ మెట్టిదనఁగా-

శివమహాపురాణము - రుద్రసంహిత - సతీఖండము - **29**వ అధ్యాయం - **47**

శ్లో॥ శివేతి ద్వ్యక్షరం యస్య - నృణాం నామ గిరేరితం
సకృత్ ప్రసంగాత్సకల - మఘ మాశు నిహంతి తత్''

ఇఁక విష్ణు భాగవతములోని శ్లోకమును గమనింపుడు!

శ్లో॥ యద్వ్యక్షరం నామ గిరేరితం నృణాం - సకృత్ప్రసంగా దఘ మాశు హంతి తత్॥

వీనిలో పదపౌర్వాపర్యములో మార్పుమాత్రము కలిగి అర్థ మొకటియై యున్నది.

''శివ'' అను రెండక్షరములను ప్రసంగవశాత్తైనా ఒకమారు ఉచ్చరించు మానవులకు పాప మంతయు వడిగా నశించును.'' అని సతీదేవి దక్షప్రజాపతికి ప్రబోధించెను.

దీనికి శాస్త్రిగారిట్లు అనువాదము జెప్పిరి. చూడుడు!

కం॥ శివ యను నక్కరములు రెం, డవియించును దలచువారి ♦ యఘ పుంజములన్
శివునిc బవిత్రయశస్కుని, శివేతరుcడ వీవు దెగడ ♦ జిత్రం బగునే! (స. ఖం. ౧-300)

భారద్వాజ గోత్రమునందు - ఉద్భటారాధ్య వంశమునందు జన్మించిన నాగవీరయ్య శాస్త్రిగారు - సహజపాండితితో సద్యః స్ఫురణతోడను - అతులితమేధాసంపత్తితో శ్రీశివమహాపురాణము ననువదించి మహామహాపండితుల మెప్పుc బడసినారు. వీరు నాకు విద్యాగురుతుల్యులైనను - తమ పురాణ రచనను కొనసాగించుతఱి - అల్పజ్ఞుcడనైన నాకు కొన్ని ఘట్టములను చదివి వినుపించిరి. అప్పుడు నేను వీరి కవితామాధురిని యథాశక్తి ఆస్వాదించి ధన్యుడనైతిని.

శ్రీ దివాకర్ల వెంకటావధాని, శ్రీమాన్ డాక్టర్ దాశరథి - కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ- కవిచక్రవర్తి చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి - శ్రీ కాశీ కృష్ణాచార్య - మహోపాధ్యాయ ముదిగొండ నాగలింగశాస్త్రి మొదలగు విద్వన్మణుల - పరిశోధనాత్మక సముల్లేఖనముల ముందు నా యభిప్రాయ మెంత? నేనెంత?

తథాపి - శాస్త్రిగారి జ్యేష్ఠపుత్రులు - శాస్త్రీయ లౌకిక విజ్ఞాన పరిపూర్ణులునగు శివశ్రీ ముదిగొండ మార్కండేయ గారు ఆసక్తితో కోరినందున యత్కించిత్ వ్రాయవలసివచ్చినది.

పోతన మహాకవిగారి పద్యసరళిని - శ్రీనాథుని రచనాపాటవమును కవిత్రయము వారి కవిత్వధోరణిని పరిగ్రహించి రచించిన పవిత్ర గ్రంథమును - శ్రీగణపతి పార్వతీపరమేశ్వరుల నారాధించినట్లు - శాస్త్రిగారు - భూ మ్యాకాశములc బోలినవారు జన్మనే గాక విద్యాబుద్ధుల నొసcగూర్చినవారు నగు జననీ జనకులకు అంకితము నిచ్చిరి.

సంస్కృత శివమహాపురాణము- విద్యేశ్వర - రుద్ర - శతరుద్ర - కోటిరుద్ర-ఉమా- కైలాస-వాయవీయ - అను ఏడు సంహితలతో **24000** శ్లోకములలో నుండగా శ్రీశాస్త్రిగారు రుద్రసంహితలోని సృష్టిఖండముతో తమ గ్రంథమును ప్రారంభించుట స్వేచ్ఛానువాదముగా స్వతంత్ర గ్రంథముగా పరిణతయ్యెనది.

ఇఁక వీరి శివభక్తి పారవశ్యమును గమనించుడు!

సీ॥ శీతాంశుధరు నెంచు ♦ చిత్తంబు చిత్తంబు, భవు సమర్చన సేయు ♦ పాణి పాణి
ప్రమథ నాథుని జేరు ♦ పదములు పదములు, శివుని సన్నుతిసేయు ♦ జిహ్వ జిహ్వ
విశ్వేశుకథ విను వీనులు ♦ వీనులు, కాలకాలునిc జూచు ♦ కనులు కనులు
పరమేశుc గొల్చెడు ♦ భాగ్యంబు భాగ్యంబు, దర్పకారికి నొంచు ♦ తనువు తనువు

గీ॥ పురహరుని గొల్వబూనిన ♦ బుద్ధి బుద్ధి
శ్రీశసాయకునకు మ్రొక్కు ♦ శిరము శిరము
శంకరుని భక్తిc బడసిన ♦ చదువు చదువు
నాగభూషణు సేవించు ♦ నరుcడు నరుcడు. (పా. ఖం. ఆ. 3 ప. 119)

ఇంకను పార్వతీ ఖండమున – పంచమాశ్వాసమున – ఐదవ పద్యమును పరిశీలించినచో శ్రీశివయోగి – నాగవీరేశ్వర శాస్త్రిగారి కవితాప్రౌఢిమ – విబుధుల కవగాహన మగును.

సీ॥ కోటిమన్మథలీల ♦ గొనc జాలు చక్కంద, నంబు మేలొందు రూ ♦ పంబువాడు
కోటి సూర్యుల కాంతిc ♦ గొఱతc బెట్టించు ద, ట్టంబైన కాంతి మం ♦ డలమువాడు
కోటిచంద్రమసుల ♦ కోమల కళల ర, మ్యంబైన నగు లేమొ ♦ గంబు వాcడు
కోటీంద్ర విభవంబుc ♦ గుదువ పెట్టుకొను ది, వ్యంబైన మణిమండ ♦ నంబు వాcడు

గీ॥ చారుకస్తూరికాగరు ♦ చందనాను, లేపన సుగంధబంధురా ♦ టోప మెసcగు
వాcడు రుచిరతరామూల్య ♦ వస్త్రయుగ్మ, కలితుcడగు వాడు శంభుండు ♦ గాంచcబడియె.

ఇట్టివి ఎన్నో పద్యములు శాస్త్రిగారి ప్రతిభc జాటునవి కోకొల్లలిందు గలవు. విస్తర భీతిచే విరమించుచు చివర నొక మాట వ్రాయుచున్నాను.

''ఋషీణాం పున రాద్యానాం – వాచ మర్థోఽనుధావతి'' యన్నట్లు వీరు పద్యములను గద్యములను వ్రాయుతఱి – వీరి పదములను వాక్యములను – సరసము మధురంబునైన యర్థము అనుసరించినందున శాస్త్రిగారు – మార్కండేయ జనకులగుటకతమున – మృకండు మహర్షితుల్యులనియు, వీరి ప్రథమ తనయుcడు – తమ గ్రంథరచనా ప్రాశస్త్యము గల యశస్సు దిగంతముల యందు వ్యాపించునట్లు – దీనిని పంచమావృత్తి గల దానిగ – ప్రచురింపcజేయుట– రామకృష్ణ యోగీంద్రులను వివేకానందుcడు ప్రకాశింపc జేసినట్లు – శైవలోక కల్యాణ కారకమైనది.

ఏతాదృశ మహాగ్రంథము – బహుళప్రచారము నంది ఆచంద్ర తార్కారము విలసిల్లు గాక!

ఓం తత్సత్

నిర్మల శంకర శాస్త్రి

---::O::---

# శ్రీశైవమహాపీఠ ఉపపీఠాధిపతి

## సద్గురు వర్యులు శివశ్రీ కందుకూరి శివానందమూర్తిగారు

* * *

ఓం

సుమరు ఏబదిమూడు సంవత్సరములకు పూర్వము పరమ మాహేశ్వరులు శివశ్రీ ముదిగొండ నాగవీరేశ్వర శాస్త్రులవారు శ్రీశివపురాణమును తెలుగు పద్యగద్యములందు చేసి ప్రకటించిరి. పండితామోద యోగ్యమై, జనావళికి పారాయణ గ్రంథమై, జనాదరణము పొందుటచే అనేక మారులు ఈ గ్రంథము పునర్ముద్రితమైనది. ఆనాడు కవి పండిత శిఖామణులైన సర్వశ్రీ చెళ్ళపిళ్ళ, కాశీ కృష్ణ మాచార్య, విశ్వనాథ, దాశరథి, సరిపెల్ల విశ్వనాథ శాస్త్రి, కాశీనాథుని పూర్ణ మల్లికార్జునుడు, వేటూరి, వేలూరి, ఇంకను ఇట్టి మహామహులెందరో సవిమర్శకముగ ఈ పుణ్య గ్రంథమును అత్యుత్తమమని శ్లాఘించియున్నారు. ఇక చెప్పుట కేమున్నది? పండితులు, భక్తులే కాక రసజ్ఞులైనవారు కూడా ఈ రచనయందు నవరసములను ఇందు నిర్దుష్టముగా ఆస్వాదించగలరు.

శైవ పురాణములు తమోగుణ ప్రధానములని ఒక వాడుక. అది చాల తప్పు. శివుడు రజస్తమోగుణ ప్రధానుడగు దక్ష ప్రజాపతి కుమార్తె సతిని ఆమె జగత్పూజ్య యయ్యును ఆమెను దక్షునకే తిరిగి ఇచ్చెను. అయోగ్యుని హస్తమందుండి యోగ్యమైన వస్తువైనను శివునికి అస్వీకార్యమే. ప్రకృతినిర్మితమై శివజ్ఞాన శూన్యమగుటచే తన్ను గుర్తింపజాలని గణపతి శిరస్సును తీసి శివభక్తి యుతమైన గజేంద్రుని శిరస్సుతో ఆతని నలంకరించి ఆతనిని జగత్పూజ్యుని చేసెను. దేవతలకు, మునులకు, యోగులకు, మహర్షులకు–ఇక జీవులందరకు జయింపరాని మహామోహ స్వరూపమగు కామమును త్రుటిలో భస్మీకృతము కావించెను.

మహా తామసమగు త్రిపురాసుర సమూహమును క్షణమాత్రమున శివుడు దహించెను. అట్టి లోకపీడాకరంబులైన తమోరజస్సులను, అవిద్యను నిర్మూలించి లోకానుగ్రహము చేసిన శివునిగాథ తమోగుణప్రధాన మెట్లు కాగలదు? తమోనాశన హేతువై, ముముక్షువులకు జ్ఞానామృతమై, శివపారమ్యజ్ఞానరహితులకు మేలుకొలుపై కర్తవ్య బోధ చేయు మోక్షసామ్రాజ్య మార్గమీ గాథ. బ్రహ్మదేవుడు నారదునకు ఇట్లు ఉపదేశించినాడు.

చ॥ విను మఖిల ప్రపంచలయ ♦ వేళఁ జరాచరవస్తుజాల మె<br>
ల్లను లయ మొందినప్పు డభి ♦ లమ్ము తమోమయమై యనర్కమై<br>
యనలనిశాకర గ్రహాధ ♦ రాంబువియత్పవమాన శూన్యమై<br>
యనహమునై యరాత్రమయి ♦ య ప్రతిమంబగు నప్రధానమై.

తే॥ పంచతన్మాత్ర లవియు న ♦ ప్పట్ల వెలయ, వట్టి సూదుల బెజ్జ మౌ ♦ నట్టి గట్టి<br>
బెట్టిదపు గ్రుడ్డిచీకటి ♦ పెరిమయమర, నుండె సద్వస్తు వొక్కండు ♦ నిండు మీఱ.

(సృష్టిఖండము ప. 172, 173)

సర్వజగుత్తును దాని కారణభూతమగు ప్రధానమును కూడా లయింపజేసిన శుద్ధవిద్యా స్వరూపుడగు శివుని తత్త్వము ''పద్మేక్షణుండు, ఏనున్ నిక్కమెఱుంగ జాల'' మని బ్రహ్మదేవుడు పేర్కొనెను. శివతత్త్వ ప్రబోధకమగు ఈ బ్రహ్మవాక్యములు రెండు పద్యములందు ఈ మహాకవి మృదుమధుర పదములతో చెప్పగలిగెను. రాత్రియు, పగలు కాక, ప్రధానములేక, పంచతన్మాత్రలు లేక మిగిలియుండు సద్వస్తువొకటి ఏదికలదో అది శివుడు. నిత్యమును కంఠస్థము చేసి పాడుకొనుటకు యోగ్యమైన ఇట్టి పద్యములు ఈ పురాణమందు వందలున్నవి. మన్మథుని దహించు శివుని నేత్రాగ్ని శుద్ధ తేజముగ ఇట్లు వర్ణించబడినది.

చ॥ తెల తెల బోయెఁ జందురుఁడు ♦ తెంపఱి మాఱున డాగె వేడివే
ల్పుల పవనుండు నిల్చెఁ దన ♦ యక్షులఁ గప్పికొనెన్ మహేంద్రుఁ డా
జలనిధి ఘోష వెట్టెను గృ ♦ శానుఁడు దీమఱి యాఱుచుండె ది
క్కులు గనరాకయుండె శివ ♦ ఘోరదృగగ్ని మహోగ్రదీప్తికిన్. (పా. ఖం. ఆ-2, ప.138)

కామాంధకార పాపఫలములగు ఇంద్రుని వేయికన్నులు మూతపడినవి. ఎంత యద్భుతము! శివానుగ్రహము లేక ఎవ్వడీ కామమును జయింపగలడు?

అగ్ని, చంద్రుడు ఇవన్నియు శివుని నేత్రాగ్ని కాంతియందు నిస్తేజమైనవి. ఈ పద్యము

''నతత్ర సూర్యోభాతి న చంద్ర తారకం
నేమా విద్యుతో భాంతి కు తోయమగ్నిః
తమేవ భాంత మనుభాతి సర్వమ్
తస్య భాసా సర్వమిదం విభాతి.''

అను మంత్రమును జ్ఞాపకము చేయుచున్నది. అట్టిది సర్వతేజములకు కారణమగునది శివ నేత్రాగ్ని తేజము. ఈ పద్యము కవితా దృష్టితో చూచినచో మనోహరము. ఇచట వర్ణింపబడినది అగ్ని యొక్క వేడికాక వెలుగు.

శివమహాపురాణమను సంస్కృత మూల గ్రంథము చాలా పెద్దది. అందలి గుణములు, రసములు శ్రద్ధతో నుద్ధరించి చాతుర్యముతో సులభసాధ్యము చేసిన ఈ మహాపురాణము ఆంధ్రులకు మహోపకృతి. ఆంధ్రకావ్య జగత్తునందొక ఉత్తమ భూషణము.

ఎంతయో శ్రమకోర్చి దీనిని పునర్ముద్రణము చేయుచున్న శివశ్రీ ముదిగొండ మర్కండేయగారు ఎంతయో ధన్యులు

ఇతి శివమ్

**10-6-2000**

---::O::---

రమ్యకథా జగత్తుకు శ్రీకారం చుట్టగల రుద్రసంహితను అందుకే ముందుగా ఎన్నుకున్నారు. శివపురాణమంటే శాస్త్రిగారికి – 'శర్వకథాసుధాభిధారారవహ సర్వభాగ విభవాస్పదధామ' మటు. ఈ క్రింది పద్యం ఆంధ్రశివపురాణ స్వభావ దర్పణం.

శైవపురాణ మెందును బ్రశస్తము శర్వకథా సుధాభిధా
రావహ సర్వభాగ విభవాస్పద ధామము భూరివిస్ఫుర
ద్భావరసాభిరంజకము పాతకకోటికిc బూరుషార్థల
క్ష్మీవిలసన్నివాస మని చిత్తమునం దిగురొత్తు వేడ్కతోన్. (సృష్టి.1.10)

ఈ పద్యం మన కొక క్రొత్త వెలుగు ప్రసరిస్తోంది. ఒక తెలుగుకవి పురాణాన్ని చూచే విలక్షణమైన వైఖరిని ప్రదర్శిస్తోంది.

శాస్త్రిగారు 1947 ప్రాంతంలో ఈ పురాణాన్ని రచించారు. పురాణరచనా సంప్రదాయాలను పుక్కిట పట్టటమే కాకుండా సమకాలీన పురాణ రచనా స్పృహను కూడా సంతరించుకొని తమదైన విశిష్ట కవితా వ్యక్తిత్వాన్ని ప్రదర్శించారు. వస్తువుకు శివపురాణం పాతదే కావచ్చు. 'పురాఽపి నవమ్' అన్న శబ్ద వ్యుత్పత్తికి పునరభివ్యక్తిని తెలుగులో శాస్త్రిగారు కల్పించారు. ఇది ఇరవయ్యో శతాబ్ది కడుపార కన్న పురాణం.

సంస్కృతంలో శివపురాణమంటే వ్యాస మహర్షిదే!

తెలుగులో శివపురాణమంటే ముదిగొండ వారిదే!

**సాటిలేని శివపురాణం :–**

1. తెలుగులో యథామూలంగా అనువదించే రచనలను ఆంధ్రులు ఆదరించలేదు. రామాయణ భారత భాగవతాలు అందుకు ప్రధాన సాక్ష్యాలు. తెలుగులో యథావాల్మీకాలైన రామాయణాలకు ప్రాచుర్యం లేదు. అవాల్మీక కల్పనలున్న రామాయణాలే ప్రసిద్ధికెక్కాయి. భారతం కూడా అంతే. కవిత్రయం వారు భారతాన్ని అనుసృజనం చేశారు కాని అనువాదం చేయలేదు. శ్రీమద్భాగవతాన్ని పోతన భక్తికవితతో సగానికి సగం పెంచి [illegible]ంచాడు. పోతన భాగవతం పునస్సృష్టి.

2. ఆధునిక యుగంలో పురాణ రచన రెండు పాయలుగా సాగింది. మూలగ్రంథాలను యథాతథంగా తెలుగు పద్యగద్యాలలో రచించటం. తెలుగులో పురాణాలు రచించినా కావ్యశైలీ విన్యాసం రవళించాలి. అమూలకమైన కల్పనలూ, అపూర్వమైన శైలీ–ఈ రెండూ లేకపోతే ఎంతటి అనువాదాలైనా ఆంధ్రుల ఆదరాభిమానాలను పొందవు. అందుకే పురాణ రచనలో రెండో మార్గం ఈ పద్ధతిని ఆశ్రయించింది. ఇది ప్రతిభాపూర్ణమైన కవితా ప్రస్థానం.

3. మూలాను సారి పురాణ రచనను తెలుగులో సంప్రదాయ మార్గమంటారు. ప్రతిభావంతమైన పురాణ రచనను నవ్యసంప్రదాయ మార్గమంటారు. నవ్యసంప్రదాయ మార్గంలో ఒక్కొక్క రచన ఒక్కొక్క ప్రయోగంగా ప్రకాశిస్తుంది. శ్రీముదిగొండవారి శ్రీశివపురాణం అటువంటిదే.

4. 20వ శతాబ్ది ఉత్తరార్థంలో నవ్యసంప్రదాయోద్యమంలో సాగిన పరుగు పందెంలో ముందుగా కనుదేవి రెండు పురాణాలు 1. దేవీ భాగవతం 2. శివపురాణం. అయితే, ఈ రెండు పురాణాల రచనా చరిత్రలలో కొట్టవచ్చినట్లు ఒక తేడా కనబడుతుంది. దేవభాగవత రచనలో దాదాపు పదిమంది పరుగు పందెంలో దాదాపు ఒక శతాబ్ద కాలం పాల్గొన్నారు.

5. శ్రీముదిగొండ నాగవీరేశ్వర శాస్త్రిగారి శ్రీశివపురాణానికి తెలుగులో పోటీ లేదు. ఈ శతాబ్ది ఉత్తరార్థంలో వెలువడిన ఉత్తమ శివపురాణం. ఇది అనువాదం కాదు అనుసృజనం. పార్వతీ, కుమార, లింగవైభవ ఖండాలను ఆయన విస్తరించి రచించారు. ఉమా, లీలా, కైలాస, వాయవీయ ఖండాలను సంగ్రహించి రచించారు. సృష్ట్యాది ఖండాలను మూలానుసారంగా రచించారు. మూలంలో పునరుక్తాలైన కథార్థాలను తొలగించారు. సమయోచితంగా ఈ పురాణంలో భాగవత స్కాందాది పురాణాలనుండి మహాభారతం నుండి కథార్థాలను, భావాలను పొందుపరిచారు. ఆధునిక యుగంలో మూలవిధేయ దృష్టిని వదలి స్వతంత్ర ప్రతిభతో నిర్మించిన పురాణాలలో ఇది ఒకటి. శివపురాణాలలో ఇది ఒక్కటే!

### రసవత్పురాణ కథాకథన శైలి :

ఆంధ్ర సాహిత్యంలో పురాణ రచనాశైలులను పరిశీలిస్తే పురుషార్థ ప్రధానాలైన పురాణ కథలను రసశిల్పసమన్వితాలుగా చేసి, పురాణాన్ని ఒక రమణీయ రసవత్కథా మంజరిలా తీర్చిదిద్దే పద్ధతి మొదటిదైన రసవత్పురాణ కథా కథనశైలి. అటువంటి దానికి నన్నయభట్టే మొదట మార్గం చూపాడు. దానిని పురాణానికి అన్వయించుకుని మారన కవి మార్కండేయ పురాణంలో వెలయించాడు. ఈ మార్గంలో నడచిన వారు ప్రాచీనులలో వెన్నెలకంటి సూరన, నంది మల్లయ ఘంట సింగయలు. ఆధునికులలో దేవీభాగవత కర్తలు. ఆ వరుసలో చివరి మహాకవి శ్రీశివపురాణ కర్త శ్రీముదిగొండ నాగవీరేశ్వర శాస్త్రిగారు.

ఇక భక్తి పురాణ కవితకు శిఖరప్రాయుడు బమ్మెర పోతన. వర్ణనా వైదగ్ధ్యాన్ని ప్రదర్శించి పురాణ రచన చేసినవారిలో ఎఱ్ఱన, శ్రీనాథుడు, ధూర్జటి, తెనాలి రామకృష్ణుడు మొదలైనవారు ప్రసిద్ధులు. శివపురాణం ప్రాచీన పురాణ మార్గాన్ని ఆధునిక కవితా పాకంలో పొంగించిన రసవత్కథా సుధానిధి.

**నవ పంచలక్షణం: –**

'పురాణం పంచలక్షణమ్' అనేది ప్రసిద్ధమైన నిర్వచనం. అది ప్రాచీన పురాణాలకు వర్తించే సూత్రమని పురాణ విమర్శకుల అభిప్రాయం. కానీ పురాణానికి ఇతమిత్థమని ఒకలక్షణం చెప్పటం కష్టమని కూడా విమర్శకులు చేతులు చాచి ఊరుకున్నారు. దానికి కారణం పురాణాలన్నీ కొన్ని మౌలిక సూత్రాలకు కట్టుబడి ఉన్నా విభిన్న ప్రయోగాలు చేసి పురాణ ప్రక్రియకు విస్తృతిని కలిగించడమే.

పురాణ ప్రక్రియలో నవ్యతను సాధించిన గౌరవం ఏకదేవతాత్మకాలైన పురాణాలకు ప్రత్యేకంగా దక్కుతుంది. అటువంటి వాటిల్లో శివపురాణం, భాగవతం, దేవీభాగవతం చెప్పుకోదగినవి. ఈ మూడింటికీ సంప్రదాయ పరంగా వస్తున్న పంచలక్షణ సూత్రం పట్టదు. అట్లని వాటికి అంతర్గతమైన లక్షణ సూత్రం లేదని చెప్పలేం. ఆ పంచలక్షణం వాటికి వర్తించే నవపంచలక్షణం. వైవిధ్యంతో వికాసం చెందిన పురాణ ప్రక్రియలకు ఒక వినూత్న మార్గదర్శకత్వం నిర్వహించిన పురాణాలు ఏక దేవతాత్మక పురాణాలు. వాటిల్లో శివపురాణానికి ఒక ప్రత్యేకత ఉంది. అందులోనూ శ్రీముదిగొండ నాగవీరేశ్వర శాస్త్రిగారి ప్రయోగంలో ఒక ప్రత్యేకత ఉంది. ఒక మాటలో చెప్పాలంటే ప్రాచీన సాహిత్యంలో వీర శైవపురాణ నిర్మాణ ప్రక్రియలో అపూర్వ ప్రయోగం చేసి పాల్కురికి సోమనాథుడు ఎంత కృషి చేశాడో, ఆధునిక ఆంధ్ర సాహిత్యంలో శ్రీశివపురాణాన్ని పునర్నిర్మించి వినూత్న ప్రక్రియగా ఆవిష్కరించి శ్రీముదిగొండ నాగవీరేశ్వర శాస్త్రిగారు అంతటి కృషి చేశారని చెపితే అతిశయోక్తి కాదు!

**ఇది ఒక తెలుగు కవి శివుని కిచ్చిన నవశంకరాభరణం!!**

ప్రాచీన పురాణాలలో సర్గప్రతిసర్గాదులతో మూలకారణమైన ఆత్మభవుని గురించి చెప్పే తత్త్వంతో ప్రారంభమౌతాయి. ఈ లక్షణాన్ని దృష్టిలో పెట్టుకొని గమనిస్తే మూల శివపురాణం విద్యేశ్వర ఖండంతో మొదలౌతుంది. ముదిగొండవారి శివపురాణం సృష్టిఖండంతో ప్రారంభమవుతుంది. సృష్టిఖండం రుద్రసంహితలో భాగం. ముదిగొండవారు రుద్రసంహిత అనే పేరు చెప్పకుండానే సృష్టిఖండం అని ప్రారంభిస్తారు. అది సాభిప్రాయంగా అమరింది. అందులో మునులడిగిన ప్రశ్నను గమనిస్తే ఆ శుభారంభంలో ఉన్న ఆంతర్యం గోచరమౌతుంది.

ఉ. సర్గముకన్న మున్ను బురశాసనుఁ డెట్టుల నుండు? నింక నా
సర్గపు మధ్య నెక్కరణిఁ జక్కఁగఁ గ్రీడ యొనర్చు? దాని యు
త్సర్గమునం దెటుల్ మరలఁ దా వసియించుఁ? గృపాళు! సెప్పుమా!
భర్గుఁడు లోకశంకరుఁడు పన్నుగ నెట్లు ప్రసన్నుఁ డయ్యెడున్? (సృష్టి. 1.80)

సర్గంతో పురాణకథ మొదలౌతుంది. అయితే ఆ సర్గానికి పూర్వమే పరబ్రహ్మ చైతన్యం ఉంటుంది. అది ఏ విధంగా ఉంటుందని చెప్పే తత్త్వాన్ని బట్టే పూరాణ తత్త్వం ఏర్పడుతుంది. ఈ పురాణంలో ఆ పరతత్త్వం పరమశివుడు. సర్గప్రతిసర్గాలకు సమాంతరంగా శివపురాణ కథ నిర్మింపబడే స్వభావాన్ని కవి ఈ విధంగా స్పష్టం చేశాడు. గమనించండి –

గీ॥ బ్రహ్మ విష్ణువు రుద్రుండు పరమశివుని, యంశములటంచు నందుఁ బూర్ణాంశుఁ డల్ల
రుద్రుఁడని వినుచుందు, మారుచిరమూర్తి, విస్ఫురిత లీలలను వినిపింపు మనఘ!

క॥ రుద్రావిర్భావంబును, రుద్రాణీ జన్మకథ నిరూపింపు విప
శ్చిద్రాజులు మెచ్చఁగ వి, ద్వద్రమణా! నీదు కీర్తి వర్ధిలు భువిలోన్ (సృష్టి. 1.82, 83)

పురాణాలలో సర్గఖండం వంటిది శివపురాణాలలో సృష్టిఖండం. ఇలా అన్వయించు కుంటే శివపురాణ ప్రక్రియ స్వభావం స్పష్టమవుతుంది.

శివతత్త్వ ప్రతిపాదికమైన ఈ శివపురాణం పురాణ పంచలక్షణాలకు ప్రతిగా తనదైన పంచలక్షణాలను నిర్మించుకుని తన విశిష్ట ప్రక్రియాప్రయోగ ప్రాభవాన్ని చాటుకున్నది. దానిని తెలుగులో వెలుగులోకి తీసికొని రావటమే కాకుండ సంస్కృత శివపురాణంలో కంటే పంచలక్షణాలకు ప్రాణం పోసి, శివపురాణ ప్రక్రియా స్వరూపస్వభావాలకు ఒక పరిపూర్ణతను, ప్రసన్నతను, కావ్యగౌరవాన్ని కల్పించిన మహాపురాణ కర్త శ్రీముదిగొండ నాగవీరేశ్వర శాస్త్రిగారు.

తెలుగు రసికులకు శివపురాణం హరవిలాస కావ్యసాగరంగా సాక్షాత్కరిస్తుంది. తెలుగులో వెలువడిన శివలీలాకావ్యాలలో కథల కన్నింటికి ఇది కన్నతల్లిగా కనపడుతుంది. అందువలన శివపురాణం జనాదరణం చెందింది.

**ముదిగొండవారి పురాణ కవితా శైలి:–**

పురాణంగా శ్రీశివపురాణానికి ప్రయోగపరంగా ఒక ప్రత్యేక వ్యక్తిత్వాన్ని కల్పించిపెట్టిన శ్రీముదిగొండ నాగవీరేశ్వర శాస్త్రిగారు కవితాపరంగా కూడా తమశైలికి ఒక విశిష్ట వ్యక్తిత్వాన్ని రూపొందించుకొన్నారు. అది బంగారానికి తావి అబ్బినట్లయింది.

శాస్త్రిగారు తిరుపతి వేంకటకవుల యుగ ప్రభావానికి లోగినవారు. శ్రీ చెళ్ళపిళ్ళ వేంకట శాస్త్రులవారు స్వయంగా ఈ పురాణాన్ని పరిష్కరించారు. వారిరువురికీ ఉన్న కవితాబాంధవ్యం శాస్త్రిగారి ఈ క్రింది పద్యం స్పష్టం చేస్తుంది. కవి చేసిన కవిస్తుతిలో చివరివారు తిరుపతి వేంకటకవులే కావటం విశేషం.

చ॥ తిరుపతి వేంకటేశ కవిధీరులు కావ్యములందు భారత
స్ఫురిత పథానురోధగతి సొంపులు నింపిరి నేను నట్లె యా
దర మెసఁగంగ వారి సువిధానపు భంగి నెఱింగి కబ్బమున్
బరఁగ రచింతు; దీని పరిపాకము లోక మెఱుంగుఁ గావుతన్ (సృష్టి. 1.21)

తిరుపతి వేంకటకవులు ఆశుకవితకూ, అవధానకవితకూ, కావ్యకవితకూ, నాటక కవితకూ, దేవీ పురాణాది పురాణ కవితకూ తమదైన కొన్ని బాణీలను ఏర్పరిచి కవితా ప్రస్థానాన్ని సాగించారు. వాటిల్లో శాస్త్రిగారికి వారి కావ్యప్రస్థానం నచ్చింది. వారు కవిత్రయ భారత రచనను ప్రామాణికంగా తీసికొని పదప్రయోగాదులు చేశారు. శాస్త్రిగారికి తిరుపతి వేంకట కవుల ఆ తీరు నచ్చింది. శివ పురాణాన్ని తిరుపతి వేంకటకవుల కావ్యశైలిలో సంతరించారు. అంతటితో ఆగితే శాస్త్రిగారు అనుకర్తలయ్యేవారు. పూర్వకవుల లోని మేలిమిని గ్రహించారే కాని వారిని అనుకరించటం అలవాటు చేసికొనలేదు. మూలాన్ని యథాతథంగా అనుసరించటమే ఇష్టంలేక మార్పులు చేసి తన కూర్పరితన్నాన్ని ప్రదర్శించిన శాస్త్రిగారు కవితాశైలిలో తమ నేర్పరితనాన్ని కూడా ప్రకటించారు. తన కవితా మార్గాన్ని తాను నిశ్శంకగా చెప్పుకొన్నారు.

ఉ॥ ''డొంకలఁ జేరి పోకల కడున్ గడు సుందర మొప్పఁ జూపు టే
బింకమె? మాఱుమూలలఁ బ్రవేశ మొనర్పక పల్కు మాధురిన్
బొంకము దప్పనీక రసమున్ దనరింపగఁ జాలు మేలి ని
శ్శంకపథంబు నే కృతి కొసంగెద సత్కవిరాజు లౌననన్'' (సృష్టి. 1.20)

డొంకలు అంటే బండ్లు నడిచే బాటలు. అంటే నలిగిన బాటలు. పూర్వకవులు చూపిన బాటల్లో సాగిపోతూ ఎన్ని అందచందాలు కవితలో ప్రదర్శించినా రక్తికీ రాణింపుకూ రాకపోవచ్చు. మారుమూల పదాలు వాడుతూ గొట్టుగా కవిత్వం వ్రాసినా ప్రజలకు అందుబాటులో ఉండక పోవచ్చు. కాబట్టి శాస్త్రిగారు ఈ రెండు పద్ధతులూ వదలివేశారు. మాటలలో మాధుర్యం ఉండాలి. పొంకం చెడకూడదు. రసానందాన్ని కలిగించాలి. ఈ మూడు లక్షణాలు కలిగిన ఒక కవితా మార్గాన్ని ఎటువంటి శంకలు లేని విధంగా శివపురాణానికి శాస్త్రిగారు కల్పించారట! కవిరాజులు ఆ మార్గాన్ని మెచ్చుకుంటారట!

ఈ మాటలు అనుకర్త అనలేడు. స్వతంత్ర కవితాశైలీ నిర్మాత అయిన ప్రతిభావంతుడే అనగలడు. శాస్త్రిగారిది మేలైన స్వతంత్రశైలి. అది శంకలేని సత్యం!

పురాణానికి పల్కు మాధురి జీవం పోస్తుంది. పొంకం వీడని రచన కవితకు శక్తిని, రక్తిని కలిగిస్తుంది. రసవత్ప్రచన కావ్యకళా శిల్పాన్ని సంతరించి పెడుతుంది. ఈ మూడు గుణాలు ఒక త్రివేణీ సంగమం. దానితో శివపురాణం కావ్యగుణాన్ని పొందిన పుణ్యపురాణంగా అవతరించింది. కవిశైలి పురాణానికి కావ్యగౌరవం సంతరించింది.

స్వతంత్ర శైలిగల శాస్త్రిగారి కవితలో పూర్వకవుల ప్రభావాలు నీడల్లాగా కనబడుతూ ఉంటాయి. కాని, శాస్త్రిగారు వారెవ్వరికీ నీడగా కవిత రాయలేదు. పోతన్నలాగా పద్యాలెన్నో వ్రాశారు కాని భాగవతంలోని భక్త్యావేశం శాస్త్రిగారి కవితలో పొంగులు వారదు. హంగులు తీర్చుకుంటుంది. శ్రీనాథుడంటే శాస్త్రిగారికెంతో అభిమానం. 'నిస్సీమోల్ల సద్వాగధీశానీ దత్త వర ప్రసాద కవితా సామ్రాజ్య ధౌరంధర్యం' శ్రీనాథాదుల కవితావైభవం. శ్రీనాథుడు ఈశ్వరార్చన కళాశీలుడు. వ్రాసినవన్నీ శివకావ్యాలే, శైవపురాణ ఖండాలే. ఆయనే శివపురాణం వ్రాసి ఉంటే శాస్త్రిగారికి ఈ అదృష్టం దక్కేది కాదు. శివ పురాణాన్ని శాస్త్రిగారి కోసం వదలిపెట్టినందుకు శ్రీనాథుడికి కృతజ్ఞతలు చెప్పారు శాస్త్రిగారు. తమ అదృష్టాన్ని అభినందించుకున్నారు కూడా. శాస్త్రిగారు శ్రీనాథుడివలె శివభక్తుడే కాని, శ్రీనాథునివలె వైదర్భీరీతి వైభవంతో కవిత చెప్పే మార్గంవారు కారు. వీరిది ప్రసాదమధురమైన ప్రసన్నమైన కథా శైలి.

అందువలన శివపురాణం చదువుతూ ఉంటే పురాణ శ్రోతకు శ్రవణానందాన్ని కలిగిస్తూ వస్తువుమీద ఆసక్తిని పెంచుతుంది. శబ్దార్థాలంకారాలను వాడినా అవి సహజాలంకారాల లాగే కవితకు రమ్యతను కలిగిస్తాయి. భక్తిని ఊహాంచలాలతో ఆకసపు టంచులకు పోనీయక నిగ్రహాంగా కవితను సాగించటం శాస్త్రిగారి స్వభావం.

మాయాకిరాతుడిని శివుడిగా ఎరిగి అర్జునుడు స్తుతించే ఘట్టంలో నన్నయ వంటి సంయమి దండకమందుకొని శివస్తుతి చేశాడు. శ్రీనాథ పోతనాదులైతే ఒడలు మరచి ఛందోలాస్యం చేసేవారు. కాని, శాస్త్రిగారు ఆ ఘట్టంలో భక్తుడిగా కాక జ్ఞానిగా రచన చేస్తారు. మచ్చుకీపద్యం చూడండి.

చ॥ ''తెలిసితి నయ్య! ని న్నఖిల దేవశరణ్య! వరేణ్య నీశ్వరున్
బలుమఱు గృష్ణుఁడున్ గురుఁడు బన్నుగఁ జెప్పిరి నీ వినోదముల్
దలఁపఁగ లేక యిట్లు దురిత మ్మొనరించితి సైఁపు మెట్టు లేన్
గలుష చరిత్రు నన్ బరమకారుణికాత్మ! మహాత్మ! యాదృతిన్'' (లీలా ఖం. 514)

మరొక కవి అయితే పరమేశ్వర కల్యాణ రూపగుణ వైభవాన్ని నోరారా ఆ పద్యమంతా నింపివేసేవాడు. శాస్త్రిగారు 'తెలిసితినయ్య' అని ఎత్తుకున్నారు. సగుణరూపముగా నిలిచిన పరమేశ్వరుని నిర్గుణ బ్రహ్మంగా తెలిసికొన్నట్లు పార్థునిచేత పలికించారు. కృష్ణ బృహస్పతులు చెప్పిన ఈశ్వర తత్వాన్ని మనసులో నెమరువేసికొన్నాడు. తప్పులు మన్నించుమని శరణాగతిని భజించాడు. శివతత్త్వం శరణాగతి అనే భావాలకు పట్టంకట్టి భక్త్యావేశానికి కళ్ళెం వేసే కవితాధోరణి శాస్త్రిగారిది. ఈ పురాణంలో ఉన్న ప్రత్యేకత అదే. ఏమైనా శాస్త్రిగారి బాణీ శాస్త్రిగారిది.

**తండ్రికి తగిన కొడుకు:**

శ్రీ ముదిగొండ నాగవీరేశ్వర శాస్త్రిగారు శివపురాణం రచించి పరాన్ని పొందారు. ఉత్తమ సంతానాన్ని పొంది ఇహంలో ధన్యులైనారు. శ్రీ ముదిగొండ మార్కండేయులు వారి కుమారులు. మార్కండేయుని కథంటే శాస్త్రిగారికి చాలా యిష్టం. పద్మపురాణాంతర్గతమైన మార్కండేయోపాఖ్యానాన్ని వాయవీయ ఖండంలో అరువు తెచ్చుకొని శివపురాణానికి వన్నె పెట్టారు. మార్కండేయుని చేత శివస్తుతిని 15 పద్యాలలో నోరార చేయించారు. శంభుప్రియ, శివప్రార్థనా వృత్తాలలో ప్రత్యేకించి పలికించారు. ఒక విధంగా భావిస్తే కవి మానసపుత్రుడు మార్కండేయుడు చిరంజీవి. ఆ పేరు కన్నకొడుకుకు పెట్టుకున్నాడు. మార్కండేయులుగారు తమపేరుకు పేరు తెచ్చుకుంటున్నారు. తమతండ్రిగారు రచించిన శ్రీ శివపురాణాన్ని పునః పునః ముద్రించి తరతరాల తెలుగు ప్రజలకు అందిస్తూ నాగవీరేశ్వర శాస్త్రిగారి సారస్వత కీర్తికి మార్కండేయ చిరకీర్తిని కల్పిస్తున్నారు. ఇటువంటి పుత్రుణ్ణి కన్న తండ్రి ధన్యుడు! అటువంటి తండ్రికి భక్తితో సేవచేయగలిగే పుత్రుడు కృతార్థుడు! శివపురాణం పంచమ ముద్రణ గౌరవం పొందుతున్నదంటే శాస్త్రిగారి కవితాశక్తితో పాటు మార్కండేయులు గారి పితృభక్తి కూడా ప్రధాన కారణమనటంలో అనుమానం లేదు. వారు నిరంతర సాహితీ యజ్ఞంగా ఈ శివపురాణ ప్రచురణ కార్యక్రమాన్ని సాగించి కన్న తల్లిదండ్రుల ఋణాన్ని తీర్చుకొనటమే కాకుండా శివప్రసాదానికి పాత్రులౌతున్నందుకు వారిని మనసారా అభినందిస్తున్నాను.

శివపురాణ రచన కెంత ప్రాచుర్యం ఉందో కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ మొదలుకొని తెలుగునేల దిగ్దంతులవంటి మహాకవులు, విద్వన్మణులు రచించిన పీఠికలకు కూడా అంత పలుకుబడి సాహిత్యలోకంలో ఉంది. మహామహులు పరమహంసలుగా పలికిన పీఠికా ప్రసంగాల ప్రక్కన ఒక క్రౌంచంలా జంకుతూ పలికే నా గళానికి , కలానికి అవకాశం కలిగించిన మాన్యమిత్రులు శ్రీ మార్కండేయ గారికి కృతజ్ఞతలు. ఈ మాటలు వ్రాసింది నాకు శక్తి ఉండికాదు. శాస్త్రిగారి మీద భక్తికొలది మాత్రమే.

జి.వి. సుబ్రహ్మణ్యం

హైదరాబాదు
**24-5-2000**

---::O::---

# పీఠిక

## (ప్రథమ ముద్రణము)

## కవిసమ్రాట్టు శ్రీవిశ్వనాథ సత్యనారాయణగారు

* * *

శ్రీః

ఈ శివపురాణ మష్టాదశపురాణములలో నొకటి. దీని యాంధ్రీకర్త బ్రహ్మశ్రీ ముదిగొండ నాగవీరయ్య శాస్త్రిగారు. ఇన్నాళ్ళకీమహాగ్రంథము తెలుగు లోని కనువదింపఁ బడుట భాషా సరస్వతి యదృష్టము. అదృష్ట మేలననగా నొక గ్రంథము మంచి కవి చేతిలోఁ బడుట పుణ్య విశేషము. ఆకాశిపోకాశికవి కావ్యమును బాడుచేసి సమర్థుఁడు మరల ముట్టుకొనుటకుఁ గూడ కొంకునట్లు చేయును. మొదట నీకవియొక్క మహాప్రతిభా విశేషము, వైదుష్యము, రచనలోని నేర్పు, అనంతమార్గముల విహరించగల యీయన పద్యరచన, పూర్వకవులయందలి పరమాదరము, విమర్శనీయములు. వీనిలోఁ గొన్నిటిని స్థాలీపులాకన్యాయముగ నెత్తి చూపి తరువాత పురాణమును గుఱించి ముచ్చటించెదను. ఒక గ్రంథ మొకకవి వ్రాయుట కధికారము కావలయును. ఆ యధికార మీయన యొద్ద నెంతవఱకున్నది? అందులో నియ్యది మహాగ్రంథము. అనంతమైన శక్తి కలవాడు గాని యిట్టి గ్రంథము వ్రాయుటకుఁ దలపెట్టడు. పుట కిఱువది యెనిమిది పంక్తుల చొప్పున నిది యేడువందల యెనుబది పుటల గ్రంథము. సుమారాఱువేల పద్యములు.

అప్పకవి సత్కవియొక్క లక్షణము చెప్పుటలోఁ బూర్వకవీశ్వర వాక్ప్రయోగ దక్షతగూడ నొక్కటిగాఁ జెప్పెను. ఈ కవికి శ్రీనాథుఁడు, పోతన్న, తిక్కన్న, చేమకూర వేంకటకవి ప్రధానముగా నభిమాన పాత్రములు. వీరిలోఁ బోతన్నగారియం దీకవికిఁ గల భక్తికిఁ బరిమితి లేదు. ఎన్నిచోట్లనైనఁ బోతన్న గారి పద్యములు పుణికి పుచ్చుకొనును. దీని కచ్చముగాఁ బోతన్నగారి యందలి భక్తి కారణము కాకపోవచ్చును. విష్ణుపారమ్యమును బోధించు పురాణము భాగవతము. ఈ పురాణము శివపారమ్యమును బోధించునది. భాగవతములో సర్వదా విష్ణుదేవునకుఁ బరమౌత్కృష్ట్యము చెప్పఁబడును. ఇచట శివునకుఁ జెప్పఁబడును. రెండును భక్తిమతములే. రెండును మఱల వైదికమతములే. ఈ గ్రంథములకు సామ్యము మిక్కిలి యున్నది. అందుచేత నీకవి భాగవతము వలెఁ జాలచోట్ల రచన చేయుట వస్తుమర్యాదను బాటించుట యేమో! భక్తిని బోతన్నగా రిట్లు చెప్పిరి.

మ॥ తనుహృద్భాషల సఖ్యమున్, శ్రవణమున్, దాసత్వమున్, వందనా
ర్చనముల్, సేవయు, నాత్మలో నెఱుకయున్, సంకీర్తనల్, చింతనం
బును, నీతొమ్మిది భక్తిమార్గముల సర్వాత్మున్ హరి న్నమ్మి స
జ్జనుఁడై యుండుట భద్ర మంచుఁ దలఁతున్ సత్యంబు దైత్యోత్తమా! (భాగవతము)

గీ॥ శ్రవణమును గీర్తనంబును స్మరణ, సేవ, నములునున్ దాస్యమును నర్చనయును వంద
నమును, సఖ్యంబు, స్వాత్మార్పణమును ననెడు, నవవిధాంగములుండె తనర్చుభక్తి.
(శివపురాణము స. ఖం. 229)

ఇది సామాన్యము

సీ॥ శీతాంశుధరు నెంచు చిత్తంబు చిత్తంబు, భవుసమర్చన చేయు పాణిపాణి.

సీ॥ పరమశివార్చనా పదవి నొందcగలేని, యిక్కcగా దది పాcపడొక్కగాని
.... ........ ...... (శి.పు. పా.ఖం. 3-121)

ఈ పద్యములు పూర్తిగా ప్రహ్లాదచరిత్రలోనివి.

పార్వతీదేవి సరిగా రుక్మిణీదేవి వలెనే మాట్లాడును.

కం॥ పంచాననధన మగు నన్, గొంచక యొండెవcడు పెండ్లి గొనcగలc డంబా!
పంచాననధనము నిలక, వంచకమతి యొక్కనక్క వడయునె యెందున్.
(శి.పు. పా.ఖం. 4-314)

ఉ॥ శ్రీయుతమూర్తి! యోపురుష సింహమ! సింహముపాలిసొమ్ము గో
మాయువు కోరినట్లు మదమత్తుcడు చైద్యుcడు.... (భాగవతము)

క॥ భూషణములు శ్రుతులకు పరి, పోషణములు దృఢవికాసబోధాగతి కా
శ్లేషణములు సుఖసిద్ధికి, తోషణములు మదికి నీమృదుల భాషణముల్.
(శి. పు. పా. ఖం. 5-292)

మ॥ పొలcతుల్ మాయలమారు లెంతయును నప్పూబోcడు లున్నట్టి చో
టెలమిన్ జేరcగ రాదు బ్రహ్మనయినన్ హేలావిశేషంబునన్
కలcతం బుచ్చి యలంత్రు గిత్తవలె లోగంజేతు రవ్వారి య
త్తలపుల్ క్రూరము లుల్లముల్ విసము నిర్దాక్షిణ్య లీనాతుకల్. (యు.ఖం. 212)

మ॥ తలcపుల్ చిచ్చులు మాట లుజ్జ్వల సుధాధారల్ ప్రియుండైన పూ
విలుతున్ మెచ్చర యన్యునిన్ వలతురే విశ్వాసమున్ లేదు క్రూ
రలు తోడున్ బతినైన చంపుదు రధర్మల్ నిర్దయల్ చంచలల్
వెలయాం డ్రెక్కడ! వారివేడబము లావేదాంతసూక్తంబులా! (భాగ. స్కం. 9)

ఈ రచనలోని సామ్యము చూచునది. మఱియు శ్రీనాథుని పోకడలు

సీ॥ పరుగిడు నేవీటి పడమర విభుజాడ, కృష్ణవేణి సరోజకిసలపాణి (లిం.ఖం. 1-47)

సీ॥ ప్రవహించు నేవీటి పశ్చిమ ప్రాకార, మొరసి గంగమ్మ సాగరముకొమ్మ (కా.ఖం.)

క॥ కిగ్గాడి దైత్యుc డీతం, డెగ్గనకయె.... .... (శి. పు. యు.ఖం.398)
ఈ కిగ్గాడి శబ్దము పింగళి సూరన్న గారిది.

మఱి తిక్కన్నగారి పోకడ –

చ॥ అలతులఁ బోదురే గురుఁడు నభ్రధునీతనుజుండు చివ్వలో
నలిగిన వీరి నోర్వఁగల యౌజిసికుం డెవఁ డల్ల కర్ణుఁడుర్
బలియుఁడు ద్రోణజుండు పరిపంథివిదారణధీరుఁ డట్టివా
రల గెలుపొందువారలె పురద్విషుసాయము లేక పాండవుల్! (లీ.ఖం. 1-445)

ఈ కవి యెన్ని మార్గములనైన పోఁగలడు. ఈ చేమకూర వెంకన్న ననుసరించిన యమకములు చూడుడు.

క॥ గంగావతరణమునకే, గంగాఁ దగ దెవరు కొంత కాలం బిటు లా
గంగావలె ఱే డేఁపడ, గంగా శిక్షించు నాజ్ఞ గడచిన వారిన్. (పా.ఖం.1-254)

క॥ లేమావివిరులతూపుల, లేమా! మన మెదిరి గెలువలే మార్తిబడన్
లేమామరు నేలఁగ నా, లేమాకుల జొంపములఁ గలియ గన్గొనుమా! (కు.ఖం.2-204)

క॥ గంగా! మాకలుషము లడ, గంగా పొనరింపు మమ్మ! కారుణ్యా మెసం
గంగా నీసరిధుని కలు, గంగా విన మెందు నిజము కంజాతముఖీ! (ఉ.ఖం.14-359)

మఱి శ్లేష: –

గీ॥ చక్రదుఃఖావహుండైన సత్సమగ్ర, వసువును హరించినను గురువనితఁ జెంది
నను గువలయేందిర వరియించెను గలాదు, కాముకులుగాంతురే యెందుఁ గల్మషముల. (శి.పు.)

ఈ చూపించిన యుదాహరణల వలన యీకవి యెంతమందికవుల ననుకరించినను నీయన యభిమానము పోతన్నగారి యందె యెక్కువ. చివరకు దనవంశవర్ణనము చేయుచు,

సీ॥ ఏవ్వాని శుభనామ మే ప్రొద్దు నుడివిన, జనులకు పాపసంచయము తొలఁగు. (స్ృ.ఖం.1-48)

ఈ రీతిగా నెన్నియేనియుఁ జూపించవచ్చును. ఇది పూర్వకవుల వాక్ప్రయోగ దక్షత. ఈ మహాపురాణమునం దున్న గుణము లన్నియు చిట్టాగా వ్రాసి చూపించను గాని యొక్కొక్క గుణమున కొకటిరెం డుదాహరణములుగా చూపింతును.

శబ్దప్రయోగౌచిత్యము: –

గీ॥ ఎంతయేనియు శుశ్రూష హెచ్చుచుండె, చెప్పుమిప్పుడు కృపతోడ శివునితత్త్వము (స్ృ.ఖం.1-79)

ఇందలి శుశ్రూషాశబ్దము వ్యుత్పత్త్యర్థములో నెంత యందముగా నున్నది!

గీ॥ చారు కస్తూరికాగరుచందనాను, లేపనసుగంధబంధురాటోప మెసఁగు
వాడు రుచిరతరా మూల్యవస్త్ర యుగ్మ, కలితుఁడగువాడు శంభుండు కాంచఁబడియె.
(పా.ఖం. 5-7)

ఇందు ''కాంచఁబడియె'' నన్న ప్రయోగము మిక్కిలి యుచితముగానున్నది.

శా. ఐనన్ బుత్రక! శైవతత్త్వమును విశ్వాద్యుండు పద్మేక్షణుం
డేనుఁ నిక్క మెఱుంగఁ జాల మిఁక నెట్లే నర్కునిన్ దీపమ
ట్లేనిప్పట్ల నెఱుంగఁ జెప్పెదను విన్మీ నాదు వైదుష్య వి
జ్ఞాన శ్రీపరిమాణ మెంతవఱ కొజ్జం జేసి రంజించునో!

(స్పృ.ఖం.1-171)

పద్యరచన స్వతంత్రమైన పలుకుబడిలోనుండి పుట్టినది. ''ఒజ్జం జేసి రంజించునో'' యన్నమాట పలుకుబడిలోని ప్రౌఢి కుదాహరణము.

ఉ॥ కోరుము నీదు వాంఛితము కోమలి! నే నొడగూర్తు నంచు ద
వ్వారయ కేను బల్కితి..... (పా.ఖం.2-25)

దూర మాలోచింపక యనుటకు దవ్వారయ కనుటలోఁ బ్రౌఢి కలదు.

శా॥ ఆవ్రజాంగుఁడు పద్మజున్ గని మహాహర్షంబుఁన మ్రొక్కి నా
నావేదోక్తుల సన్నుతుల్ సలిపి వాఙ్నాథా! మదీయాంగనా
భావారూఢునిఁ బుత్రు నిమ్ము .......... (పా.ఖం.2-28)

'మదీయాంగనాభావారూఢునిఁ బుత్రుని' మ్మనుటలో భావగాంభీర్యమును జూడుఁడు-

లయ గ్రాహి. కొంద ఱలు కొంది ధృతిఁ జెంది సురబృందముల
నుం దురమునం దెదిరి క్రమ్మందిరి కడంకఁ (కు.ఖం.1-125)

ఇది తారకాసుర కుమారుల యుద్ధము. ఈ యుద్ధభాగములో లయగ్రాహి యింత సుకుమారముగా వ్రాయుట శైలిలోనొక మృదువైన పాక మేర్పడిన వాఁడుగాని వ్రాయలేఁడు.

ఉ॥ ప్రొద్దు కదుఁ వడిఁ బుడమి బోర్లగిలుఁ బురము ల్గనంబడఁ
హద్దును దప్పి తారలు హిమాంశుఁడు దాగుచు దిర్గుచుందు రే
సుద్దియు లేక బిక్కవడి చూచుచు నుండు జముండు మేటి యా
పద్దశఁ గడ్పుచుంటి మిది పద్మభవా! కనరాదె నీకిటుల్.

చ॥ ఎపుడొ దివంబుపైఁ బడి సురేశులతో నిసుముం బొనర్తుర
ప్డపుడును దేఱి చూచి కదు నబ్బుర మొందుచు దిబ్బ సేతు మం
చపకృతు లాడి పోవుదురు హా! యిఁక నేమి యొనర్తు మిత్తఱిన్
దెపదెపలాడు మామదుల దీనతఁ దీర్పు మనుగ్రహమ్మునఁ ॥ (యు.ఖం.1-22,23)

ఈ పద్యములలోని వర్ణన యే పూర్వకవులును జేసినది కాదు. మీస్వర్గ మంతయు బూడిద చేయుదుము, దిబ్బ జేయుదుము అనుటలో నున్న యౌచిత్యము చెప్పరాకుండ నున్నది. ఈ మాటలయందు దాయాదులయొక్క మాత్సర్యము పరమరమ్యమైన వ్యంగ్యభూత మైనది. ఇందు రసము చిప్పిలుచున్నది. మొదటిపద్యము మిక్కిలి చిత్రముగా నున్నది. ఈ రచన మహాకవులు మాత్రమే చేయఁగలరు. సామాన్యులు చేయలేరు. ఇది యంతయు నీకవి యొక్క స్వతంత్ర వావదూకత్వము.

సంస్కృతము: –

తెలుఁగు కవులు సంస్కృతసమాసములు గూర్చుటలో సులభార్థము సులభ గ్రథనము చేయవచ్చును. అట్లుగాక, అర్థవత్తుగా, తార్కికసంబద్ధముగా సమాస గ్రథనము చేయుట యొక ప్రతిభా లక్షణము.

ఉ॥ కన్నెను గాంచి యచ్చెరువుఁ గాంచి మునీంద్రుఁడు మన్మథాస్త్రసం
పన్నమనమ్ముతో నృపతివరున్య కిట్లనె.... (స్వ.ఖం.115)

ఇచటి ''మన్మథాస్త్ర సంపన్నమనమ్ము'' అన్న సమాసము ఇందాకటి ''మదీయాంగనా భావారూఢుని'' అన్న సమాసము వంటిది. ఒక విలక్షణమైన భావము గర్భమునందుఁ గల కూర్పు. ఇట్టి సమాసములు చేయుటకుఁ గవికిఁ బ్రతిభ కావలయును.

తెలుగులు –

క॥ గెల పండిన యనటుల జొ, బ్బిలు పానకములఁ దనర్చు విరివగు నెలమా
వుల పండ్లమెక్కి యుక్కువఁ, జెలఁగి వదరఁ జేసె రామచిల్కలపిండుః (స.ఖం.1–97)

సీ॥ సంజ కెంజాయల జానగు చందురు .... (స.ఖం.1–197)

సీ॥ ఎలమావులును, నిమ్మ, లీత, చిట్టీతలు .... (స.ఖం.1–383)

ఇట్లనేక పద్యములు అచ్చ తెనుఁగుతనమునే వెలయించు కొనుచుండును.

ఉ॥ .....భీతచిత్తులై
ఎప్పటి కప్పుడే గడప నెంతురు కాలము కంజసంభవా!

ఈ రీతిగా లోకసంగ్రహణము, తెలుఁగు పలుకుబడి, తెలుగుమాటల సమృద్ధి కూలంకషముగా నున్న రచన యిది.

వేదపరమార్థజ్ఞత :-

ఈ గ్రంథ మంతయు వైదికార్థములనే చెప్పును. కాని, యొక మహావిషయమును జెప్పఁదలఁచితిని. తారకుని చేత దెబ్బలు తిని కుమారస్వామి మూర్ఛపోయెను.

గీ॥ స్కందుఁ డద్దాన మూర్ఛిల్లి క్షణములోన
ఋషిగణస్తూయమానుఁడై యెఱుక జెంది (శి.పు. కు.ఖం.2-117)

మూర్ఛపడిన స్వామి ఋషిస్తోత్రములచేత మేల్కొనె ననుట శివతత్త్వ స్ఫూర్తి మద్వాక్యము.

శిల్పము :- శిల్పమన్న శబ్దమున కర్థ మిదమిత్థమని చెప్పుటకు వీలులేదు. లోకోత్తర సౌందర్య మెచ్చట పొడసూపునో యది శిల్పమని చెప్పవచ్చును. కథను జెప్పుటలోఁ గ్రొత్త రకముగాఁ జెప్పుట గొప్ప శిల్ప మని నాయుద్దేశ్యము. ఆంధ్ర వాఙ్మయములో కథాకథనరమ్యత పలుమంది పలురకములుగాఁ జూపించిరి. ఈ కవి కొన్నిచోట్ల కథను జెప్పుటలో రమ్యతనే చూపించెను.

చివరకు శివుఁడు పార్వతి నంగీకరించెను. దివ్యస్త్రీలు పరిహాసము చేసిరి. అంత నిందిర యిట్లనియె. సావిత్రియిట్లనియె. అదితియిట్లనియె. ఆవెంట జాహ్నవి యిట్లనియె. ఇట్లు దేవతా స్త్రీలందఱు తలాయొకమాట యనిరి. ఇవి చిన్న చిన్న వచనములు - వారంద రన్నమాటలు పద్యములు. ఈ రచనవలన పెండ్లిసంబరమంతయు, పరిహాస మంతయు, పెండ్లికొడుకుతో ముత్తైదువలాడు ముచ్చటలే వ్యంగ్యభూతములై కథా ఘట్టము పరమ సౌందర్య మనిపించుకొన్నది. వారట్లనిరి వీరిట్లనిరి, అని వచనములు వ్రాసి, యన్నమాటలు పద్యములుగా వ్రాయుట, పోతన్నగారి భాగవతములోని యొక రచనా పద్ధతి. ఈ రచనా పద్ధతిని ప్రస్తుతమున నీ సౌందర్యోత్పాదనకై వినియోగ పరచుట యీకవి యొక్క ప్రతిభ. మరల నీ రచనా పద్ధతినే శివుఁడు తన వీర్య మేమైనదని, వెదకుటలో జూపించెను. శ్వేతాద్రివాయుస్స్వర్ణదీవసుమత్యాదులు కుమారునికథఁ జెప్పుదురు. అచటఁ గూడ నీ సౌందర్యమున్నది.

ధ్వనులు: ధ్వనియున్న శబ్దమే విచిత్రమైన అర్థము గలది. సుకవిరచనలో రస మెప్పుడును వ్యజ్యమాన మగుచునే యుండును. కాని యల్పాల్పధ్వనులు, వస్తుకృత వస్త్వాదులు, శబ్దగతాదులు ప్రత్యేకమ్ముగా నుండఁ గొందఱు పండితులు వానినే చూచి యదియే ధ్వని మద్రచనాకావ్య మనుకొందురు. శబ్దగతములైన మఱి కొన్ని వ్యంగ్యములు చూడుడు.

గీ॥ అరయ నాధారశూన్యమౌ నాకసంబు, నందు ఱెక్కలు లేని నా డెంద మనెడు
పులు గెగురుచుండె నద్దాని భూరిదయను, నరసి ప్రోచునుగాత చంద్రార్థమౌళి
(పా.ఖం.3-85)

ఈ వాక్యము పార్వతి సప్తర్షులతో నన్నది. ఇది యలంకార కృతవస్తుధ్వని. రూపకాలంకారము చేత జీవుఁడు, ఇది శైవము కనుక నీ జీవుని రక్షించు పరమేశ్వరుఁడు వ్యంగ్యభూతు లగుచున్నారు.

పాకము:–చ. అరుణమరీచి యంత నుదయాచలపీఠము నెక్కి సర్వత
స్ఫురదసమాన మంజుకరపుంజములన్ వెలయించి యూర్ధ్వని
స్సరదమలాంశుజాలముల శైలవరోన్నతశృంగపల్వలాం
తరనళినాళిఁ గూడఁ బ్రమదమ్మునఁ బూయఁగఁ జేసె వాసిగన్.
(శి.పు. పా.ఖం.5–198)

వ్యయ కార్తీక శుద్ధ సప్తమీ గురువారము

---::O::---

# ఉపోద్ఘాతము
## (ప్రథమ ముద్రణము)

బ్రహ్మశ్రీ తూములూరి శివరామకృష్ణ శాస్త్రిగారు, మదనపల్లి.

* * *

బ్రహ్మశ్రీ ముదిగొండ నాగవీరేశ్వర శాస్త్రిగారిచే శివపురాణ మాంధ్రీకరింప బడినది.

అనూచానశైవాచార్య వంశమున జన్మించి తద్విజ్ఞానమును సమగ్రముగ గ్రోలుట వీరి ఆంధ్రీకరణమున కొక ప్రధానయోగ్యత. ఆంధ్రీకరణమున నన్నయాదుల మార్గమే యవలంబింపఁబడినది. రసవంతములగు ఘట్టములఁ బెంచుట, నీరసములను ద్రుంచుట యను పద్ధతివలన తెలుఁగున పురాణములు కావ్య శోభ నొందినవి.

గ్రంథపఠన మారంభించినది మొదలు సమాప్తిచేయువఱకు నెచ్చటను విసుగు జనింప లేదు. ఉత్తరోత్తరము రసవంతమై యాకర్షించినది. ప్రాచీన కవులయందలి సర్వ సామాన్యమగు చక్కని శైలియు ధారాశుద్ధియు నీకవివర్యునకు దైవదత్తములు. కనుకనే ఈ మహాగ్రంథము నిర్విఘ్నముగ నాంధ్రీకరింపఁ బడినది.

కవితాహంకారమున గాక శివకైంకర్య దీక్షాతత్పరతచే నీగ్రంథ మాంధ్రీకరింపఁబడినది. పద్యరూపమున నీ గ్రంథము నాంధ్రీకరించు నదృష్టము తొలుత తనకే సంభవించినదని యీ కవి మురియుచున్నాఁడు. పోతనవలెనే ఈ ఘనకార్యమున తన జన్మము కృతార్థమైనదని యుప్పొంగు చున్నాడు. పితరుల కీగ్రంథ మంకితమిచ్చుటచే పితౄణము ఆంధ్రీకరణముచే ఋషిఋణము, భక్తి విశేషముచే దేవఋణములు దీరినవి. ఈ గ్రంథమం దంతటను భక్తి యంతర్వాహినియై ప్రవహించినది. నిరంతర శివనామాస్వాదపరిపూత మగు జిహ్వనుండి యీ కవిత స్రవించినది.

ఒకే శైలూషి సందర్భానుగుణముగ వివిధ భూమికల ధరించినట్లు భావానుగుణముగా శైలి పలువిధముల మార్పు నొందినది. అప్రయత్నముగ రచింపc బడినట్లు అనేక పద్యములు గోచరించును. శివునిపై దండెత్తు మన్మథుని వర్ణించు సందర్భమున అతని సౌకుమార్యము ఈ పద్యమున మనోహరముగ గోచరించుచున్నది.

ఉ॥ వాడిన రాలిపోవు సుమవర్గము కాండచయంబు హస్షనా
నేడకొ పారు పుల్గు లొక యేవపు వారువముల్ స్వరూపమే
జూడను లేని తెమ్మెరలు చచ్చువజీరులు తోడుకుందు రే
ఱేడబలల్ బలంబులు సరే యిcక రుద్రుని తోడc బోరుటల్. (శి. పు.పా.ఖం.2-99)

సీస పద్య రచన యందు శ్రీనాథుని పోకడలు కొన్ని యెడలc గన్పించుచున్నవి.

సీ॥ ఇంద్రనీలముడాలు నీసడింపcగcజాలు, నీలంపు మైనిగనిగల వాని
వేయి రేకుల తమ్మివిరుల గెల్వcగcజాలు, విరివైన కనుదోయి వెలయువాని
(సృ.ఖం.199)

సీ॥ చాపబాణాంకుశచటులపాశారవిం, దము లొప్పు నాల్గుహస్తములతోడ
బాలేందు రేఖావిభాసితం బగుచు నం, దంబుcజెందిన కిరీటంబుతోడ
పద్మరాగచ్ఛాయ పరిఢవించిన మనో, జ్ఞములైన మాల్యాంబరములతోడ
మందహాసపు తీవి మానుగుల్కెడు దయా, స్పదములై తగు కటాక్షములతోడ

గీ॥ భవ్యకాశ్మీరగంధ లేపములతోడ
ముంగురులు మూగు కస్తూరిబొట్టుతోడ
భువనములకెల్ల భ్రమసేయు మూర్తితోడ
శంకరార్ధాంగలక్ష్మి సాక్షాత్కరించె. (పా.ఖం.1-75)

స్త్రీనిందాస్తుతులు శివకేశవులచే మిక్కిలి మనోహరముగాc జేయcబడినవి. సతీ వియోగము నొందిన శివుcడు స్త్రీని నిందించుటయు, లక్ష్మీపతియగు కేశవుcడు గృహస్థాశ్రమ ధర్మమును బొగడుటయు సందర్భసహజములు.

సీ॥ అపవిత్రములలోన నగ్రిమం బగు చోటు, బొంకుల కెల్లను బుట్టినిల్లు
కపటవర్తనములc గనc జేయు నెఱజాణ, చెడుగోతc బడcద్రోయు చెడ్డఘోటి
అనువుగా భ్రమసేయు నైంద్రజాలికవిద్య, నమ్మియేలిన చోటి నాగుc బాము
సాహసంబుల కెల్ల జంకనట్టి వలంతి, పాయంగ నీయని పరమధనము

గీ॥ ఒనరcగాc గట్టుత్రాడులం దుక్కుగొలుసు, క్షణికసంతోషమొసగు క్రొక్కారుతీగ
స్త్రీ యనcగ దానితోcబొత్తుc జెందవలదు, బ్రహ్మనిష్ఠుల కెందేని బద్మనయన!

సీ॥ అఖిలతాపంబుల హరియించు నౌషధం, బార్తికంధిని దాటునట్టి నౌక
చిత్తంబు రంజిల్లఁ జేయఁ జాలిన విద్య, సకల సౌఖ్యములకు జన్మభూమి
ప్రతిదినంబును గ్రొత్త బరగు చక్కనివిందు, కొమరారు కొలమున కమరతరువు
అన్నపానంబుల నందఁ జేసెడు దైవ, మతిథిజనంబుల నరయు తల్లి

గీ॥ దేవయజ్ఞంబునందు నెంతేని తోడు, కష్టసుఖములయందుఁ బాల్గాంచు జోడు
ఆత్మసతి యగుఁగావున నందఱకును, బెండ్లి యాడంగఁదగు గాదె పేర్మి యలర.

(పా.ఖం.3-64,68)

పోతన విష్ణుభక్తివలె గ్రంథకర్త శివభక్తి వెల్లువలై పారినది.

సీ॥ శీతాంశుధరు నెంచు చిత్తంబు చిత్తంబు, భవు సమర్చనసేయు పాణి పాణి

సీ॥ పరమశివార్చనాపదవి నొందఁగ లేని, యిక్కగా దది పాపడొక్క గాని

(పా.ఖం.3-119,121)

సందర్భానుగుణముగ లోకోక్తు లీకవిత నలంకరించినవి

చూపులగుఱ్ఱమువలె నత డేపుమెయిం బెరుగుచుండ (స్పృ.ఖం.1-428)
ఉడుము కేటి కోరి! యూరివార్త (స్పృ.ఖం.1-142)
పరులకోసరముగ బావి దూకుట మేలె
కొండ నెత్తి తలం దాల్చుకొనఁ దరంబె .. (పా.ఖం.2-100)

ఇత్యాదులు పెక్కులు

గ్రంథరాజమా! ఆచంద్రార్కము వర్ధిల్లుము.

ఓం తత్సత్ శివమ్

---::O::---

# ద్వితీయ ముద్రణోపోద్ఘాతము

## ఉపాధ్యాయ పరిషదధ్యక్షులు బ్రహ్మశ్రీ వల్లాది సూర్యనారాయణ శాస్త్రి

* * *

బ్రహ్మశ్రీ ముదిగొండ నాగవీరయ్య శాస్త్రిగారు భాషారాధన తత్పరులై పదేండ్ల
నాంధ్రీకరించి యాంధ్ర వాగ్దేవి కభినవగ్రైవేయముగా నర్పించిన యీ శివ
మాంధ్రలోకమునకు సుపరిచితమే. ఇది భాషాభిమానులయు భక్తులయు గౌరవాదరమ
యచిరకాలమున ద్వితీయముద్రణ భాగ్యమొందుటయే ప్రశంస్యార్హమై దీని పాఠకరంజకత
బ్రకటించుచుండ నిది యిట్టిదని చెప్పఁ బూనుట పునరుక్తమే.

ప్రథమ పురాణోత్పత్తి మొదలుగా నెడతెగక భరతఖండ మంతటను
పఠనశ్రవణములు రెండును భారతీయార్యజాతుల నిత్యకృత్యములై యుండెడి మట సుప్ర
దానంజేసియే యైహికాముష్మిక విజ్ఞానము సార్వజనీనమై వ్యాపించుచు వచ్చినది. అదే అక్షర
కానివారికిఁ గూడ నీతియు భగవద్భక్తియుఁ గలుగుటకును, ఆస్తికమతము లింతదనుక
నలుదెసల నిలిచి యుండుటకును, దేశ మెన్ని కష్టములపాల్పడినా హిందూ మతాచా
నిర్మూలము గాక నేఁటికిని దృగ్గోచర మగుచుండుటకును, విగ్రహారాధనవిధి
మతములవారిని విడువకుండుటకును, ముఖ్య హేతువగుట ముమ్మాటికి సత్యము. మ
అట్టి పురాణపఠన శ్రవణాచార మార్యావర్త దక్షిణా పథముల నలముకొన్న కాలమం
క్రీస్తు పూ. ఏకాదశాబ్ది మొదలుగా క్రీ॥ శ॥ అష్టాదశ శతాబ్ది కడపటివఱకుఁ గల మధ్యకాల
తత్తన్మతాభినివిష్ణులగు పౌరాణికుల భక్త్యుత్సాహాతిరేకము కారణముగా దత్తద్దేవతా
ప్రతిపాదిక మైన నూత్నగ్రంథము కొంచెముగానో గొప్పగానో శైవ వైష్ణవ శాక్తాది పురా
నన్నిటఁ బ్రవేశించి యున్నదనుటయు సత్యము. అట్లాసేతుహిమాచల మార్యజాత
భక్తిమార్గముల నిత్యసంతుష్టు లగుచున్న కొలఁదిని దాము నందందు పుష్టిగాంచుచు వచ్చి
ప్రత్యక్షమగుచున్న మహాపురాణములలోనిదీ శివపురాణము.

ఇది చిరకాల మాంధ్రము గాకపోవుట శ్రీనాగవీరయ్య శాస్త్రిగారి యదృష్టము
విద్వత్కవిచేతిలోఁ బడుట భక్తలోకము భాగ్యము. స్వతంత్రించి యొక కావ్యము నిర్మించు
సంస్కృతగ్రంథమును దెలిఁగించుట మిక్కిలి కష్టము. అందును పదుసొకండు ఖండా
లైన పెద్దభాగములతోడి యిరువదినాల్గువేల గ్రంథమగు నీ మహాపురాణమును భక్తప
మనోరంజన మగు సులభశైలి నాంధ్రీకరించుట కష్టాతికష్ట మని వేఱు వచింపనేల
ఘనకార్యము నిర్వహించి కృతార్థు లైనవారు శ్రీనాగవీరేశ్వర కవిగారు. ఆ మహాకృత్య
కొన్ని విశేషవిషయములను బాఠకులదృష్టికిఁ దెచ్చుటకై యీచిన్నవ్యాసము వ్రాయుచున్న
నేను. ఈ పని యైనా నేటి గ్రంథప్రకటనాచారమును బట్టి వచ్చినది గాని యన్యముగా

''పురాణం పంచలక్షణ'' మ్మను లాక్షణికోక్తి కనుగుణముగా నిది ముందుగా సృష్టిఖండముతో నారంభమైనది. నారదుఁడు లేని పురాణము లేదుగాని యీ ఖండమందలి యా దేవర్షి కథ యపూర్వము నద్భుతమునై కనవచ్చును. ఇది శివపురాణ మగుట మొట్టమొదటనే శివమహత్త్వ మప్రతిహత మని యుద్ఘోషించుటకో యన ''శ్రీవిష్ణువు భూతలమున శ్రీరాముఁడై యవతరించి వానర సాహాయ్యంబు నభిలషించు'' ననుటకు హేతువుగా శివమాయావిష్టుఁడగు నారదమహర్షి శాపము చూపఁబడినది. రుద్రాదుల యుత్పత్తులచే సార్థకమైన యీఖండమందలి చిన్న చిన్న కథలెల్ల పాఠకులకు సుబోధకము లగునట్లు చక్కని శయ్య నాంధ్రీకరించబడినది. అది యటుండ నీ పురాణ ముపదేశించిన శైవము ద్వైతముగాక శివాద్వైత మన్న విశేష విషయము గూడ నీ ఖండమే తెల్పుచున్నది.

గీ॥ సచ్చిదానందరూపుఁడ ♦ సత్యమూర్తి, యగు పరబ్రహ్మమేను మూ ♦ డగువిధముల
బ్రహ్మ విష్ణు హరాఖ్యలఁ ♦ బరఁగి సృష్టి, రక్షణాంతములొ నరింతు ♦ అట్టులేక.

ఒకచోట వర్ణింపఁబడిన విషయ మా పురాణము నందే మఱియొకచో వర్ణింపఁ బడుటయు, ఒక పురాణములో వర్ణితమైన కథ మఱియొక పురాణములో వర్ణితమగుటయు సర్వపురాణ సాధారణమేకాని, యీపురాణములో నితరశైవపురాణములలో లేని నూతన వర్ణన లెక్కువనుట తథ్యము. పార్వతి శివుని పరిచర్య నాచరించు విషయము పెక్కుచోట్ల వర్ణితమే కాని యది యిందలి పార్వతీ ఖండమున నొకింత క్రొత్తదారి త్రొక్కినది. ఆ మాటలు కొన్ని - హిమవంతుఁడు శివుని సమీపించి నాకూఁతురు చేయు సపర్య నంగీకరింపు మని కోరఁగా నతం డన్నమాట.

ఉ॥ ............ ఈపగిదిఁ బల్కకు మింక నగాధిరాజ! యో
షావళి యేడ? యోగుల సమక్షము లేద! యెడందఁ గాంచుమా! (పా. ఖం. 1-272)

అపుడు తండ్రిని వారించి పార్వతి శివున కుత్తర మిచ్చినది. అందలి మాటలు రెండు.

వ. లోకమునందు దేహు లెంతవఱ కింద్రియజన్యజ్ఞానానుభవంబు గలిగి యుందు రంతదనుకఁ బ్రాకృతు లౌట స్పష్టంబు.

ఉ॥ మాటలు వేయు నేల విను ♦ మా! యనుమానము మాని సర్వమున్
దేట యొనర్చెదన్ బ్రకృతి ♦ నేన్ బురుషుండవు నీవు సుంతయేన్
బూటక మే దిటన్ సగుణ ♦ మూర్తివి నాదయ నౌదు వీవు నా
కూటమిఁ బాసి సుంత యొన ♦ గూర్పఁ గలాఁడవె నిర్గుణుండవై. (పా. ఖం. 1-285)

అందుకు శివుని ప్రత్యుత్తరము-

మ॥ గిరిజా! నీవిటు సాంఖ్యవాదినివి కాం ♦ క్షింపన్ నిషేధింప ని
ష్ఠురమౌ నట్టులె చేయు ప్రత్యహము ని ♦ చ్చో నాకు శుశ్రూష నేఁ

బరమేశానుఁడ నేని మాయకు దురా ♦ పస్థాన భూతుండ నేన్
దరమే నన్నుఁ జలింపఁ జేయుటకుఁ గాం ♦ తాలోక చూడామణీ! (పా. ఖం. 1-

ఇఁక నీ ఖండము చతుర్థ పంచమాశ్వాసంబు లందుమా, అవి చదువువారు "
పరమేశ్వర కల్యాణము" అను ప్రబంధము చదువుచున్నట్లు భావింపకపోరు. అందలి రచన
శైలినే యాశ్రయించినది.

ఇందలి ఖండము లన్నియుఁ బ్రత్యేక మొక్కొక్క కావ్యముగాఁ బాఠకులు
యానందింపఁ దగినట్లు శ్రీశాస్త్రిగారి యనువాదము మృదుమధురమై మంచి పాక
బడినది. ఇందు కొకటి రెండుదాహరణములు- ఉత్ప్రేక్షాలంకృతమైన సాంధ్యరాగ వర్ణన

ఉ॥ అంత దినాంతమై యలర ♦ నర్యమదేవుఁ డపూర్వదిక్సతిన్
సంతస మొప్పఁ జేర నది ♦ జానుగ మానికపున్నివాళి న
త్యంతముదంబుతో నొసఁగ ♦ నారతనంబులదీప్తి తీ రనాన్
వింతగ సాంధ్యరాగరుచి ♦ విశ్వవిమోహన మొచు భాసిలెన్ (పా.ఖం. 5-

ఇఁక నిది పార్వతికిఁ బతివ్రతాధర్మములు బోధించు విప్రసతిమాట-

చ॥ ఒక సతి భానుమండలికి ♦ నుచ్చతరస్థలి నుండె భర్తతో
నొక సతి దాఁ ద్రిమూర్తులను ♦ నుయ్యెల బాలురఁ జేసి యూపె నిం
కొక సతి వింధ్యగర్వహర ♦ ణోగ్రుని జీవితరాజ్ఞి యయ్యె వే
ఱొక సతి మిత్తి గెల్చె మఱి ♦ యొక్కతె భానుని నాఁగె నంబికా! (పా.ఖం.5-2

కుమారస్వామి జననము తారకాసుర సంహారము మొదలగు కథాభాగములను బా
యాపురాణాదులఁ గని యుండక పోరు గాని ఆ విషయములను సవిస్తరముగా వివరించు
కుమారఖండము చదివి యాహ్లాదింపఁదగినది.

దాని తరువాత లీలాఖండ మందుమా యది శివలీలలకుం బోలె సుకవితా లీల
గుఱియై యలరారుచున్నది. అందలి దొక కథాంశము.

పుణ్యమూర్తులు మహారాజ దంపతులునై నుతిగన్న నలదమయంతుల చరిత్ర భా
నందును నైషధాది కావ్యములందును వర్ణిత మగుట విదితము. వారి పూర్వజన్మవృత్తాంత
యతినాధ లీలలో హృద్యముగా నభివర్ణిత మైనది. సద్వర్తనులు శివభక్తులు వనేచరు
భిల్లదంపతులలో భిల్లి దమయంతిగాను భిల్లుఁడు నలుఁడుగాను జన్మించిరి. వారి
రాయబారము నల్ప మహేశ్వరుఁడు రాజహంసయై జన్మించెను. ఈ కథలోఁ గర్మవశవ
మృతి చెందగ భార్యయగు భిల్లి సహగమనము చేయఁబూని చితికిఁ బ్రదక్షిణ మా
యతినాధరూపమున నందున్న శివుఁడు వినుచుండ శివభక్తి పతిభక్తుల మూర్తియౌ య
మనసార ధ్యానించుచున్న మాట యిది.

క॥ తెలిసి తెలియని నాచేఁ, తల ననుచిత మెంతయేని ♦ తనరెడుఁ గృప నా
కలుషములఁ బాపు మిదె జో, తలు చేసెద దేవదేవ! ♦ దర్పకదమనా!

భారతమందలి చిన్నకథ యాధారముగా భారవి మహాకవి కిరాతార్జునీయ మొనరించె ననుట ప్రసిద్ధము. ఆకథ వాయుపురాణమందువలె నీ శివపురాణమందు నీషద్భేదముగాఁ గనవచ్చును. ఇట్లే యెన్నోకథ లతిసంగ్రహముగానో సంగ్రహముగానో యన్ని పురాణములందును గనవచ్చు ననుట పాఠకు లెఱుఁగని విషయము కాదు.

మఱి యుమాఖండ మందలి యొకటి రెండు విషయములు.

శ్రీకృష్ణుఁడు శివుని గూర్చి తపస్సుచేయుట బహుత్ర కనవచ్చును. రుక్మిణీ దేవి పుత్రవాంఛ దీర్ప నతఁడు తప స్సొనర్పఁ గైలాసయాత్ర సాగించినట్లే జాంబవతీ పుత్త్రవాంఛ తీర్చుటకై తప మాచరింప హిమాలయయాత్ర యొనర్చినాడు. ఇందలి విశేషము కృష్ణునికి మహర్షియగు నుపమన్యుఁడు ముందుగా శైవదీక్ష యిచ్చుట. మఱియుఁ దపోనంతర మతనికిఁ పార్వతీ పరమేశ్వరులు ప్రత్యక్షమై యెనిమిదేసి వరములిచ్చుట. అవి చాలవనుకుని యుమాదేవి భక్తునియెడఁ గల వాత్సల్యముతో.

''నే హుళక్కిఁ బల్కను. భార్యా సహస్రకౌశల్యంబును దారావాల్లభ్యంబును బాంధవ ప్రేమను గనెదవు. నీ యింట నిత్య మేడువేల ద్విజులు కుడుతురు'' అనుచు మఱికొన్ని వరము లడుగకనే యిచ్చెను.

తొలిముద్రణమం దతిసంగ్రహముగా నున్న శ్రీరామచరిత్ర మీ ముద్రణమందు పుష్టిఁ గాంచి యింపగురూపముతో దర్శన మిచ్చుచున్నది. మురారికవి యన్నట్లుగా నిట్టి యవతారపురుషుఁడు జగత్తులో మఱియేఁడి? అట్లే సీతారాములను స్తుతింపని పురాణమేది? రావణసంహారానంతర మగ్నిపరీక్ష యైనంత బ్రహ్మదేవుఁడు సీతను శ్రీరాముని కప్పగించుచుఁ బల్కిన మాటలివి.

చ॥ పరమపతివ్రతామణినిఁ ♦ బామరుఁ డట్టులు పల్కి తగ్గులం
దుఱుక నుపేక్ష చేసితి వి ♦ దొప్పునె చెప్పుము రామచంద్ర! నీ
చరిత మెఱుంగవై తి వల ♦ చక్రధరుం డగు విష్ణు వీవ యీ
సురుచిరగాత్రి శ్రీరమణి ♦ చుమ్మలు మాన్పి సతిన్ గ్రహింపుమా!

ఈ పురాణము శివాద్వైతపర మని కైలాసఖండము కంఠోక్తి నిట్లున్నది.

క॥ అద్వైతము శివవాదం, బాద్వైతంబును సహింప ♦ దరయు మది మునీం
ద్రా! ద్వైతము నశ్వరము శి, వాద్వైత మనశ్వరంబు ♦ హరు వొప్ప నిలన్.

ఇం దుపాంత్యముగా నున్న వాయవీయఖండము శైవతత్త్వసార బోధక మనుట నిస్సంశయము. ఇతర పురాణములందును ఈ పురాణమందలి యితర ఖండము లందును జగదుత్పత్తి స్థితిలయాది ప్రసక్తి లేకపోలేదు. కాని యీ ఖండమందు వాటి ప్రశంస వినూతనమై వేద్యాంశముఁ గనఁజేయ విస్తరించినది. ఇఁక కట్టకడపటి విద్వేశ్వర ఖండము ప్రధానముగా భక్తులకును శివతత్త్వ జిజ్ఞాసువులకును పూజా జపలింగధారణాదిక ముపదేసించుచు శైవమతము దేశమున విస్తరింపఁ జేయు విధానము నభివర్ణింపుచు మోక్ష సిద్ధికి భక్తి మూల మను పరమ సిద్ధాంతమును ప్రతిపాదించినది. వేద శాస్త్రాభిమతమైన పూజాభిషేకాది విధానముల శివుని నిష్కామబుద్ధితో నర్చించువారు తుదను శివసాయుజ్యము నొందుదురని సాయుజ్యముక్తి నుపదేశించినది.

ఇట్లీపురాణము నీతి భక్తి ముక్తి మార్గము లుపదేశించుచు నాంధ్రభాగవతము మాడ్కి నాదరణీయమై వెలయుచున్నది. ఈరెండును పరస్పర సన్నిహితములైన పురముల జన్మించిన వగుటచే అక్కగారి పోకడలు కొన్ని యీచెల్లెలు నేర్చుకొన్నది. అది సహజము గదా. ఇందొకతె శ్రీవిష్ణువు నింకొకతె శ్రీశివు నాశ్రయించి రన్న పేరేకాని,

''యధా శివమయోవిష్ణు। రేవం విష్ణుమయశ్శివః'' అన్న యద్వైతభావ మీ యిద్దఱి హృదయముల నంతర్భూతమై యున్నది. కావున శ్రీమద్భాగవతము కైవడి నీ శ్రీశివపురాణము నాంధ్రుల యాదరాభిమానముల నందఁగలదని యాశించుచున్నాను. ఇఁక నిందలి కథావిషయ ప్రశంసను సంగ్రహించుచు శివ కేశవులు వివాహవిధిని గూర్చి తెలిపిన భేదాభిప్రాయములు మాత్రము తెలిపెదను.

ఈ క్రిందివిషయము పార్వతీఖండము మూడవ యాశ్వాసములోనిది.

''లోకములో కామునివంటి దుష్టుఁడు లేఁడు. వాని మూలముగా దేవమానవలోకముల జరిగిన యకార్యము లన్ని యిన్ని కావు. కావుననే నేను వానిని మాడ్చితిని. మీరెవ్వరును స్త్రీలను చేరనీయవద్దు నేను పార్వతిని పెండ్లాడను'' అనుచు శివుఁడు దేవతలకు బోధించి యెక్కువగా స్త్రీ నింద గావించెను. అపుడు శ్రీవిష్ణువు లోకములో స్త్రీవంటి వస్తువే లే దనుచు స్త్రీస్తుతి గావించి నీవు లోకరక్షణార్థమై పార్వతిని పెండ్లాడఁదగునని శివుని వేఁడుకొనెను. వినఁ జదువ నింపైన యీప్రసంగ మవశ్యపఠనీయము. ఇఁక నీపురాణమందలి భాషావిషయమును గూర్చి రెండు మాటలు. శ్రీనాగవీరయ్యశాస్త్రిగారు శ్రీనాథ పోతనాదుల రీతుల ననుసరించి ధారాశుద్ధిగా రసవంతముగా రచన సాగించి రనుట నిర్వివాదము.

ఇఁక నీవ్యాసము ముగించుటకు ముందు వల్లీసౌందర్య వర్ణనమందలి వొకటి రెండు. భిల్లతనూజ యగు వల్లి పెండ్లికూఁతురు. శివతనూజుఁ డగు కుమారస్వామి పెండ్లికొడుకు.

వారి కన్యోన్యము మోహము గలిగింప రాయబారము సల్పువాఁడు నారదుఁడు. శ్రీనాథాదు లొనర్చిన శృంగార వర్ణనలను తలపింపఁ జేయున దీఘట్టము.

> ''ఆ॥ బాలయొడలిచాయ ♦ పస కోడి యపరంజి
> యప్పు చెంది స్వర్ణ ♦ నుయ్యెఁ బుడమిఁ
> దగినవారితోడఁ ♦ దగుఁ గాక మచ్చరం
> బధికులందు నొంద ♦ హాని గాదె.'' (కు.ఖం.2-174)

''క॥ కమలము కమలము శశిబిం, బము శశిబింబమె యరయ స ♦ వతు వచ్చునొకో
కమనీయకోమలం బగు, రమణీమణిమోముతో న ♦ రాతివిఘాతీ!''

''సీ॥ చక్రవాకస్తని ♦ సారంగలోచన। భాసురశంకరా ♦ భరణవేణి-''

''సీ॥ కెంపువాతెరఁజూచి ♦ యింపుఁ జెందితిగాని। యార్తి దీరఁగఁ దేనె ♦ నాననైతి''

''సీ॥ అవధూతయై పృథ్వి ♦ యంతఁ గ్రుమ్మరువేల్పు। జడదారి యేటి కి ♦ చ్చటికి వచ్చె''

''సీ॥ లలితవీక్షాప్రియా ♦ లాపాక్షరములఁ జే। త మలర్పఁ బ్రణయంబుఁ దలఁపనైతి''

''ఉ॥ దాయనుబోలెఁ బాసితిఁ గ ♦ దాయను వేఱొకమాట తోఁచలేదా యను.''

ఇట్లు సరసఫణితిని వల్లీ కార్తికేయుల యన్యోన్యావలోకనము మొదలుగా వివాహము వఱకుఁగల కథాభాగమంతయు నింపగు వర్ణనలతో నలరారుచున్నది. ఇది తనివిదీరఁ జదువఁ దగిన పురాణముగాని యేవో నాలుగుపద్యము లుదహరించి నంత మాత్రమున సరివడునా! ఈకృతి ఆంధ్రవాణికి మఱియొక మణిహారము.

ఈ మహాగ్రంథము తొలిముద్రణమే చక్కని పీఠికచే నుపోద్ఘాతముచే నలంకృతమై యున్నది. ఐనను ఈ ముద్రణమునకు మఱియొక యుపోద్ఘాతము చేర్చుతలంపుతో నన్నిది వ్రాయఁగోరిరి. ఏమయితే నేమి! అవిద్వత్కవీంద్రుని యభిలాష మన్యథాకరించుట యపచారమని తలంచి నా నేర్చిన కొలఁది నీ వ్యాసము రచియించితిని. దీని యౌచిత్యానౌచిత్యములకుఁ బాఠకలోకమే ప్రమాణము.

ఓం శాంతిః

ధవళేశ్వరము
**12-1-1958**

---::O::---

# ప్రశంస

## చతుర్థ ముద్రణము

## కళాప్రపూర్ణ

## డాక్టరు దివాకర్ల వేంకటావధానిగారు, యం.ఏ. ఆనర్సు., పి.హెచ్. డి.

* * *

శ్రీముదిగొండ నాగవీరేశ్వర శాస్త్రిగారిచే రచింపబడి చతుర్థముద్రణము నొందుచున్న శ్రీశివపురాణము నందలి ముఖ్యభాగములను పఠించి యమందమైన యానందము నొందితిని. పదునెనిమిది పురాణములు జగత్ప్రసిద్ధములు. ఇవన్నియు వ్యాసమహర్షిచే రచింపబడినవి. పురాణమనగా ప్రాచీనమైనదని అర్థము. అష్టాదశమహాపురాణములను పదునెనిమిది ఉపపురాణములను, శివాగమములను శివుడు మొదట రచించి బ్రహ్మదేవున కుపదేశించెననియు, పిదప బ్రహ్మ సద్యోజాతాది పంచబ్రహ్మలను ప్రార్థించి వారి దయచే శతకోటి శ్లోకాత్మకమగు ఏకైక మహాపురాణమును మునులకు ప్రబోధించెననియు, పురాణము బ్రహ్మ ముఖోద్గతమైన పిమ్మట నాలుగు వేదములు ఆవిర్భవించిన వనియు మహాభారతమునందలి శాంతిపర్వము చెప్పుచున్నది. దీనివలన వేదములకంటె కూడా పురాణములే ప్రాచీనతరములను నభిప్రాయము కలుగవచ్చును. పురాణ శబ్దమునకు సార్థక్యము కల్గించుటకై యీ విషయము ఇట్లు చెప్పబడి యుండును. కాని ప్రపంచ వాఙ్మయమున ఋగ్వేదమే మొదటిదనియు, తరువాత నితరవేదములు వెలసినవనియు బహుపండితులు అంగీకరించిన విషయము. బహుశః పురాణములందలి కథలు శివబ్రహ్మప్రోక్తములై వేదములకు ముందే వెలువడి యుండవచ్చును. వానికి అక్షరరూపము నొసంగినవాడు వేదవ్యాసుడే. కలియుగమున అల్పాయుష్కులు, అల్పమేధస్కులునగు మానవులు శతకోటి శ్లోకసమంచితమగు మహాపురాణమును సమగ్రముగ చదువఁజాలరని గుర్తించి విష్ణువు వేదవ్యాసరూపమున పదునెనిమిది పురాణములను చతుర్లక్షశ్లోకపరిమితముగ సంగ్రహించెనని మత్స్యపురాణమున చెప్పఁబడినది. అష్టాదశవిద్యలలో పురాణములు కూడ నున్నవి. వీనికి సంహితలను నామము కలదు. ఇవన్నియు పరస్పర విరుద్ధార్థకములుకాక సూక్ష్మముగ పరిశీలించినచో ఏకార్థకములే యగును. ''ఇతిహాసపురాణాభ్యాం వేదం సముపబృంహయేత్'' అను వచనమును బట్టి ఇతిహాస పురాణములందలి విషయములతో వేదార్థమును నిరూపింపవలెనని వ్యక్తమగుచున్నది. ఇది ఇతిహాస పురాణముల ప్రాముఖ్యమును తెలుపుచున్నది. శ్రుతిస్మృతులు తనకు నేత్రములనియు, పురాణము హృదయమనియు, పరమేశ్వరుడు విరాట్ రూప సందర్భమున తెల్పి యుండెను. పురాణములను పఠింపకుండ వేదవాక్యముల కర్థము చెప్పఁజూచు నల్పశ్రుతులను చూచి వారు తన్నపార్థజుష్ట మొనరింతురేమో యని వేదము భయపడునట.

''అష్టాదశపురాణానాం దశభిః కథ్యతే శివః'' అను సూక్తివలన నాలుగు లక్షల శ్లోకములుగల పదునెనిమిది మహాపురాణములలో మూడులక్షల శ్లోకములు గల పదిమహాపురాణములందు శివుడు ప్రతిపాదింపఁ బడెననియు, మిగిలిన ఎనిమిది మహాపురాణములలో విష్ణువు, బ్రహ్మ, సూర్యుడు, అగ్ని, దేవి మున్నగువారు వర్ణింపఁబడి రనియు తెలియుచున్నది. ఈ అష్టాదశ మహాపురాణములలో శివపురాణము నాల్గవది. ఇందు **457** అధ్యాయములును, **24** వేల శ్లోకములును కలవు. వాల్మీకి మహర్షి గాయత్రీమంత్రము నందలి ఒక్కొక్క అక్షరమునకు ఒక్కొక్క వేయి శ్లోకముల చొప్పున శ్రీమద్రామాయణమును రచించినట్లు వ్యాసమహర్షి కూడ ఆచతుర్వింశత్యక్షరములను సూచించునట్లుగ **24** వేల శ్లోకములతో శివపురాణము రచించెనని పెద్దలు చెప్పుదురు. గాయత్రీ మహామంత్రము శక్తిస్వరూపమనియు, శివుడు తదర్థమనియు కొందఱు చెప్పుదురు. ''సూర్యుని మించిన తేజస్సుగల భర్గుడు (పరమేశ్వరుడు) సూర్యాంతర్గతుడై మా బుద్ధులను సన్మార్గమువైపు ప్రచోదించును గావున అట్టి పరమాత్మ నుపాసించుచున్నా''మని గాయత్రీ మంత్రమున కర్థముచెప్పి దానిని సదాశివ స్వరూపిణిగా ధ్యానింపనివారికి సద్గతి కలుగకపోవుటయే గాక విప్రతిపత్తియు సంఘటిల్లునని శివపురాణము విశదీకరించుచున్నది.

''పఠనాచ్ఛ్రవణాచ్చైవ భక్తిమాన్నరసత్తమః
సద్య శ్శివపద ప్రాప్తిం లభతే సర్వసాధనాత్''

అని శివపురాణమును పఠించువాడు సమస్తమును సాధించినవాడై శివపదమును పొందునని స్కాంద పురాణము చెప్పుచున్నది. అంత్యకాలమున శివపురాణమును వినిన యెడల శివుడు ప్రసన్నుఁడై పునరావృత్తి రహిత శివసాయుజ్యము నొసంగునని పలువురి విశ్వాసము. శివపురాణ పఠనమువలన శివుడేకాక బ్రహ్మ విష్ణ్వింద్రాది దేవతలందఱును తృప్తినొందుదురని ఈ పురాణమునందే కలదు. ఏతత్పురాణ పఠనఫలితము లనేకములిందు చక్కగా వివరింపబడి యున్నవి. శివపురాణము నొక్కమాఱు పఠించిన తరువాత పద్మపురాణాంతర్గతమగు శివగీతను పారాయణము చేయవలయును. తరువాత రుద్రాభిషేకమును, శివసహస్రనామార్చనను, శైవ బ్రాహ్మణ సంతర్పణమును చేయవలయునని సూచింపబడినది. శివపురాణ పఠనమునకు జన్మ నక్షత్రము ముఖ్యమని పెద్దలు చెప్పుదురు. శివపురాణము శివవిజ్ఞానసర్వస్వమని చెప్పఁదగినట్టిది. ఏతాదృశమైన శివపురాణమును శ్రీముదిగొండ నాగవీరయ్య శాస్త్రిగారు కవిత్రయ శ్రీనాథాది పూర్వకవుల ననుసరించి ఆంధ్రీకరించియుండిరి. తెలుగున ముత్త్రివిధములైన ఆంధ్రీకరణ విధానములు కలవు–

**1.** కథానువాదము **2.** భావానువాదము **3.** పదానువాదము

ఇందు కథానువాదము అతిస్వతంత్రమైనది. ఆంధ్రీకర్త మూలమునందలి కథను మాత్రము

అనుసరించి పాత్రరసపోషణ వర్ణ నాదులయందు స్వాతంత్ర్యము వహించును. భారతకవుల అనువాద మీ పద్ధతికి చెందినది.

భావానువాదమున మూలమునందలి భావములన్నియు యథాతథముగా ననుసరింపబడును. ఇందు స్వాతంత్ర్యము మిక్కిలి తక్కువ. తనకు అనుచితములని తోచిన భాగములను మాత్రము ఆంధ్రీకర్త కొంచెము మార్చి వ్రాయును. శ్రీనాథుని అనువాదము ఈ పద్ధతికి చెందినది. ఆధునికు లిట్లుగాక మూలమునందలి ప్రతిపదమును అనువదించుటకు యత్నింతురు. ఇందు అనువాదకర్త స్వాతంత్ర్యము కొంచెము కూడ నుండదు. ఈ అనువాదములు మూలము దగ్గరపెట్టుకొని చదివినకాని సరిగా అర్థము కావు. శ్రీనాగవీరయ్య శాస్త్రిగారు తమ అనువాద పద్ధతిని గూర్చి

కం॥ మక్కికి మక్కి యొనర్చుట, చక్కని మార్గంబుగాని చందమగుట, నా
చక్కివిడనాడి, నాయీ, ఫక్కింబొనరింతు లలిత పద్ధతి మెఱయన్.

అని తెల్పియుండిరి. వారు కొన్నిచోట్ల మూలమును పెంచియు, కొన్నిచోట్ల తగ్గించియు మరికొన్నిచోట్ల అన్యథాకరించియు, కొన్నిచోట్ల మూలమును యథాతథముగా ననుసరించియు తమ అనువాదమును సాగించి యుండిరి. స్కాందపురాణము, భాగవతము, మహాభారతము, కాలాగ్నిరుద్ర జాబాలోపనిషత్తులు మున్నగువాని నుండి కొన్ని విశేషాంశములు గ్రహించి ఇందు చేర్చియుండిరి. మూలగ్రంథము సంహితలుగను మరల సంహితలు ఖండములుగను, విభజింపబడినట్లు కన్పించును. శ్రీశాస్త్రిగారు సంహితలు అను పేరు తొలగించి అన్ని భాగములను ఖండములనియే పేర్కొని యుండిరి. శతరుద్ర సంహిత లీలాఖండమనియు, లింగ చరిత్ర ప్రబోధకమైన కోటిరుద్ర సంహిత లింగవైభవఖండ మనియు చెప్పబడినవి. మూలమున నారంభముననున్న విద్యేశ్వరసంహిత చివర విద్యేశ్వర ఖండముగా మార్చి వ్రాయబడినది. కవిగారు పార్వతీ కుమార లింగవైభవ ఖండములను మూలముకన్న పెంచి వ్రాసియుండిరి. లింగవైభవ ఖండమున మూలమున లేని మరికొన్ని దివ్యలింగములు అనువాదమున చేర్పబడియున్నవి. మూలగ్రంథ రచనాకాలమునకును అనువాదకాలమునకును చాలవ్యత్యాసము లుండుటచే కాలానుగుణమైన అట్టి మార్పు అనువాదమున అందందు కానవచ్చును. ఇందలి ఖండములన్నియు ఒక్కొక్కటి ఒక్కొక్క కావ్యముగా చదివి ఆనందించుటకు తగినట్లు వ్రాయబడినవి. పార్వతీపరమేశ్వర కళ్యాణ మిందుకు తార్కాణము. అందలి రచన ప్రబంధశైలితో సాగి అత్యంత హృద్యముగా నుండును. లీలాఖండము శివలీలలను వర్ణించును. ఇందు కవి గారి శైలి లలిత మధురముగా అలరారును.

శివపురాణ కథను సూతుడు శౌనకాది మునుల కెఱింగించెను. ఇందు పార్వతీ ఖండము మిక్కిలి హృద్యమైనది. కాళిదాసు ఇందలి వస్తువునే గ్రహించి కుమారసంభవమును రచించెను.

లీలాఖండమున శివునిలీలలు పెక్కు విశదీకరింపబడినవి. ఇందు కిరాతార్జునీయకథ ముఖ్యమైనది. నలదమయంతులకథ భారతమందును నైషధాది కావ్యములందును కలదు. వారి పూర్వజన్మ వృత్తాంతము అందు చెప్పఁబడియుండలేదు. ఇందా వృత్తాంతము ''యతినాథలీల'' లో నున్నది. శివభక్తులైన భిల్లదంపతులలో భిల్లి దమయంతి గాను, భిల్లుడు నలుడుగాను జనియింప వారి వివాహమునకు రాయబారము జరుపుటకై శివుడు రాజహంసగా జన్మించెను. భర్త మరణింపగా భిల్లి సహగమనము చేయఁబూని చితికి ప్రదక్షిణ మాచరించి, శివుని ధ్యానించుట ఆమె శివభక్తిని, పతిభక్తిని చక్కగ వెల్లడిచేయుచున్నది. లింగవైభవఖండమున సూతుడు మునులకు జ్యోతిర్లింగోప లింగములను, ప్రాచీన దివ్యలింగములను వివరించి చెప్పెను. ఉమాఖండమున ఉపమన్యుడు శ్రీకృష్ణునకు శైవదీక్ష నొసంగును.

శ్రీనాగవీరయ్యశాస్త్రిగారు సందర్భానుగుణముగ నెన్నో వర్ణనములు కావించి యుండిరి. ఈవర్ణనము లన్నియు భావగంభీరములై శ్రీశాస్త్రిగారి వర్ణనపాటవమును, లోకపరిశీలనమును, అనువాద కౌశలమును చాటుచున్నవి.

''వాడిన రాలిపోవు సుమవర్గము కాండచయంబు--'' (పా.ఖం.2-99) అను పద్యము మన్మథుని సౌకుమార్యమును మనోహరముగా తెలుపుచున్నది.

''అభ్రగంగాతరంగాళి నుయ్యేలలూగు, రాజహంసవతంస రాజి యెందు''--(పా.ఖం.1-8)

''చాపబాణాంకుశ చటుల పాశారవిం, దము లొప్పు నాల్గుహస్తములతోడ'' అను సీసపద్యము సాక్షాత్కరించిన 'శంకారార్ధాంగలక్ష్మి' స్వరూపమును పాఠకుల కన్నులకు కట్టుచున్నది.

''అపవిత్రములలోన నగ్రిమంబగుచోటు బొంకుల కెల్లను పుట్టినిల్లు''

అను పద్యము స్త్రీ స్వరూపమును

''అఖిలతాపంబుల హరియించు నౌషధం బార్తికంధిని దాఁటునట్టి నౌక''

అను పద్యము ధర్మపత్ని స్వరూపమును చక్కగా వర్ణించుచున్నవి. విస్తృతమైన ఈ గ్రంథమున ఇట్టి వర్ణనము లెన్నియో కలవు. విస్తరభీతిచే వాని నిచట నుదాహరించుటలేదు. ఆ వర్ణనములన్నియు సుస్పష్టములును, లలిత పదప్రయోగ భాసురములునై వర్ణనీయాంశము యొక్క స్వరూపమును పఠితలకు సాక్షాత్కరింప చేయుచున్నవి.

పాత్రపోషణమున కవిగారు ప్రదర్శించిన నేర్పు ప్రశంసనీయముగా నున్నది. ఇది పురాణమగుటచే నిందనేక కథలున్నవి. ప్రతి కథయందును, అప్రధానపాత్రలను కూడ కవిగారు సూక్ష్మదృష్టితో పరిశీలించి ఎంతో చక్కగ చిత్రించి యుండిరి. గుణనిధి, భిల్లపురంధ్రి, నారదుడు, విష్ణువు, కుమారస్వామి, మేనక, తులసి, శంఖచూడుడు, దుర్వాసుడు, మిత్రసహుడు, సీతారాములు, ఉపమన్యుడు మున్నగు వారి చరిత్రలు చూచిన నీ విషయము తేటతెల్లము

కాఁగలదు. పాత్రపోషణ విషయములోవలె, రసపోషణ విషయమున కూడ శ్రీశాస్త్రిగారు అత్యంత శ్రద్ధ వహించిరి. రసపోషణమే కవి కవితా కౌశలమునకు గీటురాయి. పార్వతీఖండమున నా దివ్యదంపతుల ఉదాత్త శృంగారము ఔచిత్య శోభితముగా వర్ణింపబడినది. యుద్ధ కుమార ఖండములందు రౌద్ర, భీభత్సములును, రతీవిలాపమున కరుణరసమును, లీలాఖండమున అద్భుతరసమును, శివమహిమాదులను వర్ణించుపట్ల శాంతిరసమును, మార్కండేయ చరిత్రయందు భక్తిరసమును, నిపుణముగా పోషింపబడినవి. కవిగారు శైవులు. నిత్యశివారాధన పరాయణులు. పోతరాజుచేత భాగవతమువలె వీరిచేత నీ శివపురాణము మధురసుందరముగా సంతరింపఁ బడినది. కైలాసఖండమున నీ పురాణము శివాద్వైతపరమని చెప్పఁబడినది.

> కం॥ అద్వైతము శివవాదం, బాద్వైతంబును సహింప దరయు మునీం
> ద్రా! ద్వైతము నశ్వరము శి, వాద్వైత మనశ్వరంబు హరువొప్ప నిలన్॥

అను పద్యము ఇందుకు తార్కాణము. ఈ శివాద్వైతము శైవాచార్యు లందఱిచే అంగీకరింప బడినది. ఆ లక్షణములన్నియు ఈ పురాణమునందు గోచరించును. చివరిదైన విద్యేశ్వర ఖండమున భక్తిప్రాధాన్యము ప్రతిపాదింపఁ బడినది. వేద శాస్త్రాభిమతములైన పూజాభిషేకాది విధానములతో శివుని నిష్కామముగా నర్చించు వారు శివసాయుజ్యము పొందుదురు. ఇట్లీ పురాణము కవితాకళాపరిపూర్ణ మేకాక నీతి భక్తి, ముక్తి మార్గోపదేశకమై పోతన భాగవతమువలె సర్వజనాదరణీయమై అలరారుచున్నది. శ్రీశాస్త్రిగారికి శ్రీనాథ పోతనలు ఆదర్శ ప్రాయులు. ఈ శివపురాణమున వారి కవితాఛాయలు ఎన్నో కాన్పించును.

''శీతాంశుధరు నెంచు చిత్తంబు చిత్తంబు, భవు సమర్చన చేయు పాణిపాణి''

''పరమ శివార్చనా పదవి నొందగలేని, ఇక్కగాదది పాపడొక్కగాని'' మున్నగు సీసములందు పోతరాజు తొంగిచూచుచున్నాడు.

> ''బాలబడలి చాయ పసకోడి యపరంజి, యుప్పు చెంది స్వర్ణమయ్యె బుడమిఁ
> దగినవారితోడఁ దగుఁగాక మచ్చరం, బధికులందు నొంద హానిగాదె!''

అను పద్యము శ్రీనాథుని పద్యరచనను తలపించుచున్నది.

> ''అవదూతమై పృథ్వియంత గ్రుమ్మరువేల్పు, జడదారి యేటి కిచ్చటికి వచ్చె''

అను పద్యము వసుచరిత్రయందలి ఇట్టి అర్థమే కల సీసమును స్మృతికిఁ దార్చుచున్నది.

> ''కెంపువాతెఱఁ జూచి యింపుఁజెందితిఁగాని, నార్తి దీఱఁగ దేనె నానవైతి''

> ''దాయనుబోలెఁ బాసితిగదా యను వేఱొకమాట దోఁచలే, దాయను'' మున్నగు

పద్యములు పూర్వకవుల పద్యముల కెనయై హృద్యములుగా నున్నవి.

''గున్నయేనుఁగులతోఁ గూడి నేస్తము సల్పు
కొదమసింగంబులు కూర్మిగదుర''

అను పద్యము ''శ్రవణసుఖంబుగా సామగానంబుల'' అను నన్నయగారి శకుంతలోపాఖ్యానమునందలి పద్యమును పోలియున్నది. అచ్చటచ్చట నప్రయత్నముగా దొర్లిన యర్థశబ్దాలంకారములు కావ్యమున కెంతో శోభ చేకూర్చుచున్నవి. శ్రీ శాస్త్రిగారు తిరుపతి వేంకటేశ్వరకవులలో నొకరైన వేంకటశాస్త్రిగారి శిష్యులు. అందుచే వీరికి కూడ వారికివలనే ప్రసన్నమధురమైన శైలి యలవడినది. ఏ పద్యము వ్రాసినను ధారాశుద్ధికి లోపముండదు. అది పూర్వపుణ్యముచేతఁగాని లభింపదు. అలతి అలతి మాటలతో అనల్పమైన అర్థమును ప్రకటించుటయందు శ్రీ శాస్త్రిగా రందెవేసిన చేయి. వారీ గ్రంథమున సామాన్యవృత్తములను జాత్యుపజాతులను మాత్రమే వ్రాసి యుండిరి. పార్వతీఖండమున ద్విరదగతి రగడయున్నది. అచ్చటచ్చట మనోహరములైన జాతీయములును, లోకోక్తులును ఈ గ్రంథమున గోచరించు చుండును.

పరులకోసరముగ బావి దూకుట యేల?
ఉడుము కేటి కోరి యూరివార్త.
చూపుల గుజ్జుమువలె నాతఁ డేపుమెయిం బెరుగుచుండ.

మున్నగునవి యిందుకుఁ దార్కాణములు.

రసానుగుణముగా కవిగారు శైలిని మార్చినట్లుకూడ నందందు కాన్పించును. ''ఇల క్షాంత్యాభీరు వనెడు పలుకుం దలపంగ'' మున్నగుచోట్ల వారు సందర్భోచితముగ సంస్కృత వాక్యములు కూడ చొప్పించియుండిరి. వారు స్వయముగా ఉభయ భాషలందును మహాపండితులగుటచే కావ్యమందలి భాష నిర్దుష్టముగా నున్నది. ఇంక దీనిని వారి గురువర్యులైన వేంకటశాస్త్రిగారు పరిష్కరించి యుండిరఁట. అట్టిచో నసలు దోషములుండుటకు అవకాశమే లేదు. శ్రీ శాస్త్రిగారీ పురాణమును తమ జననీ జనకుల కంకితము చేసి తమ పుత్రత్వమును సార్థక మొనరించుకొనిరి. భక్తి జ్ఞాన వైరాగ్య ప్రబోధకమైన యీ పురాణమును తెనిగించి వారు లోకమున కపారమైన యుపకార మొనరించి యుండిరి. ఇది నాల్గవముద్రణ మందుచుండుటయే దీని అధిక ప్రచారమునకు తార్కాణము. శ్రీ శాస్త్రిగారి కుమారులు శ్రీ మార్కండేయగారు న్యాయమూర్తులు పితృపాదులయెడగల భక్తిచే నీ గ్రంథమును నాల్గవమారు ముద్రింపించు చున్నారు. కవిగారి కవితాశక్తికిని, వారిపుత్రుల పితృభక్తికి నా అభినందనలు.

---::O::---

# శివనాగవీరవము

## (చతుర్థ ముద్రణవము)

## కళాప్రపూర్ణ డాక్టర్ దాశరథి, ఆంధ్రప్రదేశ్ ఆస్థానకవి

* * *

కవికులగురువు కాళిదాసుగానీ, ఆంధ్రకవితాపితామహ అల్లసాని పెద్దనగానీ పురాణములచే ప్రేరితులై మహాకావ్యరచనకు పూనుకున్న విషయం జగద్విదితం కదా!

''వాగర్థావివ సంపృక్తౌ వాగర్థ ప్రతిపత్తయే'' --

వంటి రఘువంశ కావ్య ప్రథమశ్లోకానికి మూలం వ్యాసప్రోక్త శివపురాణంలో ఉన్నదని పూజ్యులు ముదిగొండ నాగవీరయ్యశాస్త్రిగారు సోదాహరణంగా తెలిపారు. శివపురాణ వాయవీయ సంహిత త్రయోదశాధ్యాయంలోని శ్లోకమది:-

''త్వంహి వాగమృతం సాక్షాత్ అహమర్థామృతం పరం
వాగర్థ మయమే వై తత్ జగత్ స్థావర జంగమం''

కాళిదాసు కుమారసంభవ కావ్య ప్రథమశ్లోకానికి కూడా శివపురాణంలో మూలభూతమైన శ్లోకం వుంది. (పార్వతీఖండ ప్రథమాధ్యాయం)

''అస్త్యు త్తరస్యాందిశివై। గిరిశో. హిమవాణ్ మహాన్''

దీనిపై ఆధారపడిన కాళిదాసు శ్లోకం సుపరిచితం కదా!

''అస్త్యు త్తరస్యాం దిశిదేవతాత్మా హిమాలయోనామ నగాధిరాజః''

అయితే కావ్యాంతర్గత శ్లోకాల ప్రాచుర్యం తన్మూలభూతములైన పురాణ శ్లోకాలకు ఎందుకు రాలేదంటే-- పురాణాలు మిత్రసమ్మితాలు. కావ్యాలు కాంతాసమ్మితాలు. మానవహృదయాలకు మిత్రునికంటే కాంతయే సన్నిహితంగా వుంటుంది కదా!!

మహాకవి నాగవీరయ్యశాస్త్రిగారు నాకు సుపరిచితులు. వయోభేదంవున్నా మేము ఇరువురము ఏకవేదిక నుండి సికింద్రాబాదు, హైదరాబాదు నగరాలలో అనేక పర్యాయములు ప్రసంగించిన ఘట్టాలు బాగా జ్ఞాపకం.

అష్టాదశ పురాణాల్లో భాగవత మహాపురాణానువాదమునకు బమ్మెర పోతనామాత్యుడు పూనుకుని కృతార్థుడైనాడు.

పోతన పంచశతిజయంత్యుత్సవాలు ఓరుగల్లులో ఈ ఉగాది ప్రాంతాల్లో అతి వైభవంగా జరుగనున్నాయి.

పోతే – శ్రీశివపురాణానువాదమహాభాగ్యం మా నాగవీరయ్యశాస్త్రిగారికి దక్కింది.

ప్రాచీనకవులు శ్రీశివపురాణానువాదం జోలికి పోలేదు.

''శ్రీనాథాది మహాకవీశ్వరులు నిన్నే మ్రొల్ల సద్వాగధీ
శానీదత్త వరప్రసాద కవితా సామ్రాజ్య ధౌరంధరీ
శ్రీనాథుల్ మును నీ పురాణమును నాంధ్రీ గూర్ప నూహింపరు''

అన్నారు నాగవీరయ్య శాస్త్రిగారు:–

''అద్దానన్ నాయది భాగధేయమని చేతంబందు భావించితిన్'' అని వ్రాక్రుచ్చినారు.

తమకు దైవికముగా లభించిన ఈ అవకాశాన్ని అత్యంత విజయవంతముగా వినియోగించుకున్నారు విద్వత్కవులైన నాగవీరయ్యశాస్త్రిగారు.

శివాద్వైత విశిష్టతను గ్రహించాలంటే శ్రీశివపురాణ పఠనం చేయాలి. ఆ అవకాశం తెలుగు పాఠకులకు శ్రీనాగవీరయ్యశాస్త్రిగారు కలిగించారు.

ఈ ఆంధ్ర శివపురాణాన్ని తమ తలిదండ్రులకు అంకితం చేశారు నాగవీరయ్య శాస్త్రిగారు.

''బమ్మెరపోతనాఖ్య కవిభానుడు'' ''తామరసాక్షున కిచ్చె'' ననీ––

''పింగళి సూర్యనార్య కవివిజ్ఞవరుండు ప్రభావతీ చరిత్రం గమనీయ కల్పనల''––

''భక్తియుక్తిం గృతినిచ్చె దండ్రికి'' –– అనీ –– అందుకని –––

''తల్లిదండ్రులకీ ప్రబంధం బొసంగి

ధన్యతను గాంతు'' నన్నారు కవిగారు.

శ్రీనాగవీరయ్యశాస్త్రిగారి ఈ ఆంధ్ర శివపురాణము, కావ్యమువలె కడు రమణీయము. ప్రభు సమ్మితత్వ మొకచోట, మిత్రసమ్మితత్వ మొకచోట, కాంతాసమ్మితత్వ మొకచోట గోచరించును. వేద పురాణ కావ్యసంచయమువలె మనోహరమైనది.

పూజ్యులు శ్రీనాగవీరయ్య శాస్త్రిగారు సికింద్రాబాదు నివాసులు. సికింద్రాబాదును ''లష్కర్'' అనేవారు. ఈ నాటికీ కొందరు ''లష్కర్'' అంటారు. ''లష్కర్'' అనగా పారసీ భాషలో ''సైన్యము''. ఇక్కడ ఆ నాడు బ్రిటీషు సైన్యాలుండేవి. ఈ నాడు భారత సైనికదళాలున్నాయి. కనుకనే––

''సిరుల రహించు సైన్యపురసీమ వసించెద––'' అన్నారు. ఇప్పటికీ వీరి కుమారులు నా మిత్రులు శ్రీమార్కండేయగారు సికింద్రాబాదులోనే నివసిస్తున్నారు. జిల్లాజడ్జీగా పనిచేస్తున్నారు. వారి కృషిఫలితముగానే ఈ ఆంధ్ర శివపురాణము నాల్గవముద్రణకు నోచుకున్నది. ఇందుకు తోడ్పడిన తిరుమల తిరుపతి దేవస్థానమువారిని అభినందిస్తున్నాను. శ్రీమార్కండేయగారి కృషిని ప్రస్తుతిస్తున్నాను.

''ఏది విన్న మనంబునకు హెచ్చగు సంతస మావహిల్లి వే
ఱేది వినంగ వేడ్క జనియింపదు ముక్తిసతీకర గ్రహం
బేది విన్న లభించు పరమేశ్వరుఁ డేది విన్న ప్రసాద మా
పాదన సేయు నట్టిది కృపన్ సెలవిమ్ము మహాత్మ! మాకిఁకన్.''

అని శౌనకాదులు సూతుని, శివపురాణం వినిపించమన్నారు ఆ నాడు. ఈ నాడు రమణీయమైన శైలితో నొప్పారు శ్రీనాగవీరయ్యశాస్త్రిగారి ఆంధ్రీకరణము ఎవరికి వారు చదువుకొని ఆనందించవచ్చును.

''........ఈ శివపురాణమును నెవ్వరేని చదివి
రేని వినిరేని, పొత్తము నిచ్చిరేని
ఆత్రివర్గము గొని మోక్షమధిగమింత్రు''

అన్నారు కవిగారు. అట్టి మహాప్రభావము గల గ్రంథమిది. శ్రీనాథ, పోతనాది మహాకవుల రచనలతో సరితూగగల ఈ ఆంధ్ర శివపురాణము శ్రీనాగవీరయ్య శాస్త్రిగారిని మహాకవి కోటిలో చేర్చినది. వీరు కింకవీంద్ర ఘటాపంచాననులైన తొలి తెలుగు ఆస్థానకవి శతావధాని చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రులవారి శిష్యులు.

''కవిత్వము మిక్కిలి చక్కగానున్నదని మనవి చేయుచున్నాను'' అన్నారు రెండవ ఆస్థానకవులు కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు.

''బమ్మెర పోతరాడ్రచిత భాగవతమ్మె భవత్పురాణ రత్నమ్మున కీడు జోడు'' అన్నారు మూడవ ఆస్థానకవి మహామహోపాధ్యాయ శ్రీకాశీ కృష్ణాచార్యులవారు.

''.... .... ఈ మహాగ్రంథము తెలుగులోని కనువదింపబడుట భాషాసరస్వతి యదృష్టము'' అన్నారు కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు ఆంధ్రప్రదేశ్ నాలుగవ ఆస్థానకవి.

ఇక అయిదవ ఆస్థానకవినైన నేను ఈ ఆంధ్ర శివపురాణమును గూర్చి అనగలిగిన మాటలివి.

''పురాణ'' మనగా ''పురా అపి నవం'' ఇది ఎంత ప్రాచీనమైనదో అంత ఆధునికము కూడ. ముక్తక మౌక్తికములచే తృప్తినందు ఆధునిక లోకము ఈ ముక్తాఫలమహారాశిని చూచి, చదివి, అవగాహన చేసికొని, తెలుగుబాసయెడ అపారమైన గౌరవమును పెంచుకొందురు. ఆంధ్ర లోక కల్యాణమునకై ఈ శివపురాణ మాంధ్రీకరింపబడినది. శబ్దమే బ్రహ్మ. ''ఒకనాదంబు వినంగయ్యెనపు డో మోమంచు'' (శబ్ద బ్రహ్మోత్పత్తి)

<u>ఓంకారం</u> తొలుత వినపడింది.

ఆద్యవర్ణం అకారం : అది అర్కనిభము
ఉకారము : అగ్నినిభము
మకారము : ఇందుమండలము

''బీజము యోనియు బీజిగ, రాజిల్లెడు నా త్రివర్ణ రాజములందుఁ
బీజము నలువ ''అ''కారము, భ్రాజిలు నలయోని హరి ''ఉ'' వర్ణము వినుడీ!''
''వెల సెడు బీజి మకారం బలరుద్రుడు గాగ'' (సృష్టిఖండమునుండి)

ఈ అక్షరత్రయ సమాహారము ప్రణవము. మనది త్రిలింగదేశము. మనది తెలుంగుబాస-పరబ్రహ్మము త్రిమూర్త్యాత్మకము.

అక్షరాత్మకమైన మూర్తిని మనకన్నులముందు
సాక్షాత్కరింపజేసిన నాగవీరయ్య శాస్త్రిగారు ధన్యులు.

''ఉద్బోధకుడీశ్వరుడట, సద్భావముతోడ నిద్ధి సల్పుటయట, యీ
షద్భంగములేకయె కృతి, యద్భుతగతి పూర్తినొంది యలరుట యరుదే!''

శివానుగ్రహం లేనిదే ఇంతటి మహాపురాణాన్ని అక్షరరమ్యంగా రచించడం అసాధ్యం.

శ్రీ నాగవీరయ్య శాస్త్రిగారు మహాభక్తులు. కనుక భక్తి రసావేశంతో రచన చేశారు. సాక్షాత్తు భక్తిరసావతారం ఈ కవిగారు. శబ్దబ్రహ్మమునెడ కవిగారికి మిక్కిలి విశ్వాసము. అట్టి విశ్వాసము నాకును కలదు.

''అక్కఱలేదు మంత్రజప, మక్కఱలేదిక బీజసంచయం,
బక్కఱలేదికా ప్రణవ, మక్కఱలేదిక లాతిమార్గముల్
జక్కగనిట్లు శబ్దమయచారుతరంబగు బ్రహ్మముఁ, జనుం
డెక్కుడు యత్నముఁ గొని యపేక్ష నెఱుంగగ జెల్లు కోమలీ!''
(ఉమాఖండము)

అని శివుడు పార్వతికి బోధించిన విధమిది.

అట్టి శబ్దబ్రహ్మాను సంధాన ధౌరేయులైన ఈ కవి ఆంధ్రశబ్దజగత్తునకు చేసిన మహోపకారము శివపురాణానువాదము. మహాకవి శ్రీ ముదిగొండ నాగవీరయ్య శాస్త్రిగారు ప్రాతఃస్మరణీయులు.

శబ్దబ్రహ్మణే నమః

**8-2-82**
దుర్మతి మాఘ పూర్ణిమ
హైదరాబాదు.

---::O::---

# ప్రస్తావన

## (చతుర్థ ముద్రణము)

## శ్రీకాశీనాథుని పూర్ణ మల్లికార్జునుడుగారు
## ఎం.ఏ., బి.యల్., మాజీ ఎం.పి.

* * *

కొన్ని దశాబ్దములనుండి సాహితీ ప్రపంచమునకు దూరస్థుడనైన నేను వేదవ్యాస మహర్షి ప్రణీతమై విద్వత్కవివరేణ్యుడు, శివపూజాధురంధరుడునగు శ్రీముదిగొండ నాగవీరయ్య శాస్త్రిగారిచే ఆంధ్రభాషలోనికి అనువదింపబడిన శివపురాణ మహాగ్రంథమును గూర్చి వ్రాయ నుంకించుట సాహసకార్యమని తెలిసియు, నా నేర్చిన మేరకు నా భావములను వ్యక్తము చేయుచున్నందులకు సహృదయులైన పాఠకులు నన్ను మన్నింతురుగాక. చతుర్దశ విద్యాస్థానములలో పురాణములు పేర్కొనబడినవి. సమస్తధర్మములకు మూలమైన వేదరాశిలోని విషయములు సామాన్య జనానవబోధములు గాన, సర్వులకు వేదబోధిత విషయములు తెలియగలందులకు వేదవ్యాసమహర్షి పురాణములు రచించెను. వీనిలో బహుళ సంఖ్యాకములైన పురాణములు శివపారమ్యమును ప్రకటించుచున్నవి. వానిలో శివపురాణమొకటి. అందులో చరాచరరూపమైన సర్వజగత్సృష్టి మొదలుకొని, శివలీలలు, శివమహిమలు అనంతముగా వర్ణింపబడినవి.

స్వతంత్రముగా గ్రంథరచన చేయుటకంటె, ఒక భాషనుండి వేరొకభాషలోనికి అనువదించుట బహు కష్టసాధ్యమను విషయములో ఎట్టి విప్రతిపత్తి యున్ను ఉండనేరదు. అట్టిచో వేదవ్యాసగ్రథిత శివపురాణమువంటి మహాగ్రంథమును, ఆంధ్రభాషలోనికి అనువదించుట యనే కార్యము దుస్తరమని చెప్పకతప్పదు. అట్టి మహాగ్రంథమును అనువదించి, ఒక రమణీయమైన ప్రబంధముగా రచించిన పండితకవులు శ్రీనాగవీరయ్య శాస్త్రిగారు ధన్యజీవులు. పరమకారుణికుడైన శివుని అనుగ్రహమునకు పాత్రులై, వారి కవితాశక్తికి, వారి పాండిత్యబలమునకు శివానుగ్రహము తోడైనందువలననే యీ మహాకృతిని వారు రచించగలిగి రనుటలో సందియము లేదు. వారీ మహత్తర రచనచేసి శివసాయుజ్యమును బడసిరని చెప్పక తప్పదు. మహాకవి శ్రీబమ్మెర పోతనామాత్యుడు శ్రీమద్భాగవతమును తెనిగించి జన్మసార్థకతను పొందగలనని తెలిపియున్నాడు. వారు రచించిన పద్యము--

మ॥ ఒనరన్ నన్నయ తిక్కనాకది కవులీ యుర్విం పురాణావళుల్
తెనుగుం జేయుచు మత్పురాకృత శుభాధిక్యంబు తానెట్టిదో
తెనుగుం జేయరు మున్ను భాగవతమున్ దీనిన్ తెనింగించి మ
జ్జననమ్మున్ సఫలంబు చేసెద పునర్జన్మంబు లేకుండగన్.

ఇదే రీతిగా యీ కవివరేణ్యులు కూడ తమ గ్రంథములో ఒకపద్యమును రచించియున్నారు.

శా॥ శ్రీనాథాది మహాకవీశ్వరులు నిస్సిమోల్ల సద్వాగదీ
శానీదత్త వరప్రసాద కవితాసామ్రాజ్య ధౌరంధరీ
శ్రీనాథుల్ మును నీ పురాణమును నాంధ్రిన్ గూర్ప నూహింపర
ద్దానన్ నాయది భాగధేయమని చేతంబందు భావించెదన్.

ఇట్టి మహాపురాణమును ఆంధ్రీకరించుటయు, దానిని వేరితరులకుగాక, జననీ జనకులకు అంకితమిచ్చుటయు, వారి పుణ్యావిశేషము. ఇట్లంకితమిచ్చుటలో వీరు మహాకవి పింగళి సూరనామాత్యుని అనుసరించిరి.

వీరి రచనాపద్ధతి ప్రాచీన సంప్రదాయానుసారిగ నుండుటలో ఆశ్చర్యములేదు. సంస్కృతాంధ్రముల యందు వీరికిగల పాండిత్యము అసాధారణమైనది. వీరి గురువర్యులా అశేష శేముషీధురంధురులు, కింకవీంద్ర ఘటాపంచాననాది బిరుదాంకితులు, అనేక శాస్త్ర పారంగతులు అగు శ్రీ తిరుపతి వేంకటేశ్వర కవీంద్రులు. వీరి వంశమా–సనాతనాచార సంశోభితమైన శైవము.

ఈ గ్రంథములోని కవితాశయ్య ఎక్కువగా పోతనామాత్యుని శయ్యను పోలియున్నది. పోతన విష్ణుభక్తుడెటులనో, ఈ గ్రంథకర్త అటులే శివభక్తుడు. ఇరువురును రచించిన పద్యములు భక్తిపారవశ్యమును చాటుచున్నవి. నిశ్శ్రేయస సౌఖ్యమును గూర్చుటలో భక్తికి మించిన సాధనములేదని మహాకవి కాళిదాసు ఘంటాఘోషముగా నుడివియున్నాడు. ''స్థిరభక్తియోగ సులభః నిశ్శ్రేయసాయాస్తువః'' అని ఆయన రచించిన నాటక నాందీశ్లోకములలో ఒకటి. ఆ కారణమున పరమశివభక్తి ప్రబోధకమైన ఈ గ్రంథరాజము మానవకల్యాణమున కెంతయు ఉపకరించగలదు.

భక్తిభావమును ప్రచారముచేయు రచన ప్రధానముగా ద్రాక్షాపాకమున నుండుట అవసరము. పదములయొక్క అన్యోన్యమైత్రి శయ్య అని అలంకారికులు చెప్పుదురు. ఆ కూర్పు సుకుమారముగా నుండి శ్రవణపేయముగా నున్నచో దానికి వైదర్భీరీతి అని ప్రశస్తి గలదు. వీరి కవిత్వములో ఆ వైదర్భీరీతియు దానికి అనుగుణమైన శైలియు సర్వేసర్వత్ర కానవచ్చుచున్నవి. ఇది కవిగారి ప్రాగ్భవపుణ్యవిశేషము.

కవితాగుణములలో ప్రసాదగుణము అతి ప్రధానమైనది. ఆ ప్రసాదగుణము లేని కవిత్వము వాస్తవముగ నిష్ప్రయోజనమగును. ఈ గ్రంథమునందు అట్టి ప్రసాద గుణము పెల్లుబుకుచు కానవచ్చుచున్నది.

వీరి కవిత్వములో ధారాశుద్ధి పరిణతి చెందినదని చెప్పవచ్చును. ఉదాహరణముగా నారదుడు తపస్సు చేసిన వనమును వర్ణించుచున్న ఈ క్రింది పద్యము జూడదగును.

ఉ॥ నారదమౌనివర్యు డొకనాడు మహేశ్వర భక్తియోగ దీ
క్షారతుడై తుషారగిరికంధర రాజమునొంది, స్వర్ణ దీ

చారుతరంగశీకర రసప్రసరప్రకరాలవాలమా
లూర రసాలసాల తరులుంగల వంగ వనంబు నొక్కెడన్. (స్కం. ఖం. 1-89)

సంస్కృతభాషయందు వారికలము ఎంత నిరాతంకముగా నడచునో అచ్చతెనుగు నందు గూడ ఆ ధోరణి కలదని నిరూపించుటకు ఈ గ్రంథమునందలి ఒక పద్యమును ఉదాహరించు చున్నాను. నారదుడు విష్ణువును శపించే ఘట్టములోనిదీ పద్యము.

కం॥ అప్పగిదిసేయనేనిన్, దెప్పరమగు నిరయమంది దిక్కుఁ గనక బల్
ముప్పున ముఱిగెద నిక నా, తిప్పలు పాయునటులే విధింపుము శిక్షన్.
(స్కం. ఖం. 1-142)

ఇక వీరి కవిత్వములో అనేకములైన సంస్కృతభాషాసూక్తులు కానవచ్చు చున్నవి. ఉదాహరణము – కుబేరుని పూర్వజన్మ చరిత్ర ఘట్టములోనిది.

''కిముథనైః విద్యానవద్యాయది'' ''విద్యావిహీనః పశుః'' ''వాగ్భూషణం భూషణం''

ఇటులనే తెలుగులోని లోకోక్తులు కూడ విశేషముగా కాననగును.

''కోతికి కొబ్బరికాయ'' ''చూపుల గుత్తము'' ''సారకోతలు''

మొదలగునవి ఎన్నియోకలవు. గ్రంథ విస్తరభీతిచే నిందు పొందుపరచలేదు. ఈ గ్రంథము కవిత్వశిల్పమునందు అత్యున్నతస్థాయి నందుకొన్నదని యనుటలో అతిశయోక్తి లేదు. అనేకములైన రసస్ఫూర్తిఘట్టములు కలవు. దారుకావనమందు శివుడు మునిపత్నులతో కూడియున్నప్పుడు రచింపబడిన పద్యములు శృంగారరస సముజ్జ్వలములై యున్నవి. ఈ రీతినే నవరసములలో అనేకరసములు ఆయా ఘట్టములందు చిందింపబడినవి. వేయేల యీ గ్రంథము మధురాతిమధురమై కావ్యశిల్పమునకు అలంకారమై, అఖండ శివభక్తి ప్రబోధకమై తనరారుచున్నది. శివలింగ మహాత్మ్యమును గూర్చియు శివపూజా ఫలోత్కృష్టతను గూర్చియు గ్రంథమున అక్కడక్కడను చివర రచించిన విద్యేశ్వర ఖండమందు సవిస్తరముగాను మనోహరముగాను వర్ణింప బడినది. అల్పవిషయమనస్కుడనైన నాచే రచింపబడిన ఒక పద్యమును జతపరచి యీ నా వాక్యములను ముగించుచున్నాను.

మ॥ శివుడే కర్త శివుండె భర్తయనుచున్ శ్రీనాథముఖ్యుల్ మహా
కవి సామ్రాజ్య పదాభిషిక్తు లెవనిం గాంక్షించి వర్ణించి రా
శివలీలా మహిమాభివర్ణన వచః శ్రీ శోభితంబైన యీ
కవనం బొప్పెడు నా సుధాంశు రవి నక్షత్రంబుగా ధాత్రిలోన్.

బందరు
**15-2-1982**

---::O::---

# విద్యదభిప్రాయములు

## (ప్రథమ ముద్రణము)

శ్రీ కింకవీంద్రఘటాపంచాననేత్యాద్యనేక బిరుదాంచితులును గవి చక్రవర్తులును గలాప్రపూర్ణులునగు బ్రహ్మశ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రులవారు. శతావధానులు-

శ్రీవత్సరదేవతాయైనమః

### శివపురాణము

దీనిని శ్రీముదిగొండ నాగవీరేశ్వరశాస్త్రిగారు తెలిగించిరి. వీరి తెలుఁగు మక్కీకిమక్కీగాఁ గాక స్వతంత్రరచనకున్న ధారాశుద్ధిగలిగి నిర్దుష్టమై ప్రసాదగుణము గలిగి రసవంతముగ నలరుచున్నది. ఈ కవికి సంస్కృతాంధ్రములయం దసాధారణమైన సాహిత్యమున్నదని యిందలి రచనయే తెలుపుచున్నది. మూలములోనున్న విషయములు కొన్ని నేఁటికాలమునకు రుచింపవనితోచి, సంగ్రహించి యనువదించుట గమనింపఁదగిన యంశము. ఈయన జన్మము చేతనే మిక్కిలి శివభక్తుడు! కాక ప్రవర్తనచేతఁగూడ నసిధారావ్రతమగు శివభక్తిగల నిషధయోగ్యుడు. నాకీయన శిష్యకోటిలోనివాఁడగుటచే నింతకన్న నధికముగా వ్రాయక యుపాస్యుండగు సదాశివుఁ డీయనకు నిరామయమాయుర్భాగ్యాదు లొసంగి కాపాడుఁగాక యని యాశీర్వదించుచు నింతటితో ముగించు చున్నాడను.

---::O::---

### బ్రహ్మశ్రీ కాశీకృష్ణాచార్యులుగారు, అవధాని శిరోమణులు, గుంటూరు.

శ్రీలక్ష్మి హయగ్రీవో విజయతే

* * *

శ్రీరస్తు చి॥ ముదిగొండ నాగవీరయ్య మహాకవి నాశీర్వదించి వ్రాయు నభిప్రాయము. అశీరుభయకుశలోపరి.

సహజకవితాలంకృతా! మీ శివపురాణము నాకందిన మొదటిదినముననే గ్రంథమును దెఱచితిని. అప్రయత్నముగ 249వ పుటలో నట్టడుగునున్న కందము (పా.ఖం.5-134) ''జిడ్డుపెరు గూరుగాయలు'' అను పద్దెము నాకంటబడి ''యింతపెద్దపుస్తకమును ప్రత్యక్షర పరిశీలనా పద్ధతితోఁ ద్వరగాఁ జూడఁగల శక్తిలేని వృద్ధుఁడ నైతిఁగదా!'' అని నామనంబునకు విచారమును గల్గించెను. మీ గ్రంథము నందలి పీఠికోపోద్ఘాతములను మున్నుడిని సాంగోపాంగముఁగ జదివి గ్రంథము నందుఁగూడఁ గొంతవఱకు నాయా భాగములఁ జదివి పరమానందమును నొందితిని. సహజకవితాప్రియుఁడ నగుటచే నట్టికైత దొరికినప్పుడు దాని నామూలాగ్ర మనుభవింపక పోతినని విచారమేగాని అభిప్రాయమొసంగుటకు నా

యా. అనుభవము చాలు. మీ పుట్టుకైతను మీజిడ్డుపెరుగు పద్యము చూచిన
వర్ధించుచున్నది. కావున మీది పెట్టుకైతకాదు. అవకాశమున్నచో చూచుకొలందిది మీ గ్రం
నాల్గవపాలంత సదభిప్రాయం మీయవచ్చును. సుప్రసిద్ధులగు బ్ర॥ శ్రీ॥ వి
సత్యనారాయణశాస్త్రి తూములూరి శివరామకృష్ణశాస్త్రి మహోదయులు
పీఠికోపోద్ఘాతములనే నేనుగూడ నాదిలో నీ గ్రంథమును జూచియున్నయెడల వ్రాసియు
కావున వారు వ్రాసిన విషయము లన్నియు మీ శివపురాణము నందు గలవని నాకుంద
అందుచే నారెంటిని నేను యథార్థములని హృదయ పూర్వకముగ విశ్వసించు చున్నాండను
నాసొంతముగ గూడ రెండు పద్యముల నీదిగువ వ్రాయుదును.

ఉ॥ బమ్మెరపోతరాడ్రచిత ♦ భాగవతమ్మె భవత్పురాణ ర
త్నమ్మున కీడుజోడని మ ♦ నమ్మున నమ్ముచు విష్ణు శంభు శ
బ్దమ్ముల దీయ నీదుకృతి ♦ భాగవతమ్మయి యద్ది నీ పురా
ణమ్మయి గ్రాలుచుండెడు న ♦ నారత మీధర నంచు నెంచెదన్.

ఉ॥ తియ్యదనంబునందుఁ గవి ♦ తిక్కనఁ జిక్కదనంబునందు న
న్నయ్య కవీంద్రుఁ గమ్మదన ♦ మందల యెఱ్ఱనసూరి గేరదో
యయ్య! త్రిమూర్తు లీవొకఁడ ♦ వైతి వహో! ముదిగొండ నాగవీ
రయ్య! మహాకవీ! శివపు ♦ రాణమహాకృతిసిద్ధవాగ్గతిన్

నేను వయోవృద్ధుండనగుటచే నీయభిప్రాయము నాశీఃపూర్వకముగా వ్రాసితిని

27-3-1947 ఇతిశం

---::O::---

శ్రీశైవమహాపీఠాధ్యక్షులు శతాధిక గ్రంథకర్తలు, శివయోగి,
మహోపాధ్యాయ బ్ర॥శ్రీ॥ముదిగొండ నాగలింగ శాస్త్రులవారు.

* * *

గీ॥ అనఘ! నీకృతిరత్నంబు ♦ నాంధ్రశివమ, హాపురాణంబుఁ గనుఁగొంటి ♦ నా
కూర్పు నేర్పున నెలకొన్న ♦ కోమలతను, నామదికిఁ గూర్చెనిద్ది యా ♦ నంద

గీ॥ గ్రంథబహుత నమేయార్థ ♦ గౌరవమున, గొప్పదై దుస్తరంబగు ♦ నిప్పురాణ
జలధిలంఘింప నలఁతుల ♦ కలవియెయిది, భవవనధితోడ దాఁటితి ♦ భవు

ఉ॥ శైవుడ వాత్మవంశవర ♦ జాతుఁడవున్ విబుధాంధ్రభారతీ
కోవిదమౌళివిన్ గవివి ♦ గోపతివాహ పురాణరూపసం
భావితకీర్తి యైదగు భ ♦ వత్కృతి యాగతి నస్మదీయమో
దావహ మౌట వింతయెటు ♦ లన్యులనే తనియించుచుండగన్

కII అగజాపతి మహిమోన్నతి, నగణితఘనసుగుణమణిగ ♦ ణాభరణంబై
నెగడుచునుండిన నీకృతిఁ, దగుగతిఁ బొగడంగ నవ్వి ♦ ధాతకు వశమే II ౪

సీII మనుజభావము విప్ర ♦ జనువున రాజిల్లె, నద్ది శైవాన్వవా ♦ యజత నెగడె
శైవవంశ్యతయును ♦ సాహితిచే నొప్పె, సాహితి కవితచే ♦ సఫలమయ్యె
కవితయు సన్నుతిఁ ♦ గాంచె సర్వోత్తర, మౌనాంధ్రశివపురా ♦ ణాఖ్యకృతిని
నౌర! సద్గుణరాజి ♦ యన్యోన్యభూషణ, భూష్యత నొక్కెడఁ ♦ బొసఁగఁగలవె

గీII నీలగళుకృప నీయంద ♦ నిలిచెగాక, నిట్టి శుభగుణపంక్తికి ♦ హేతువైన
పూర్వపుణ్యంబు నీయది ♦ పొగడదరమె, యీాధ్యగుణపూర్తి! నాగవీ ♦ రేశశాస్త్రి!

కII భవవిలయకారి హరవై, భవనిలయంబై సమస్త ♦ భవికాలయశో
భ వఱలుచుండిన నీకృతి, భువివెలయున్ గాత మెల్ల ♦ పుడు గాశివలెౕ.

గీII ససుతదారుఁడవగు నీకు ♦ శంకరుండు, సంపద చిరాయువు సుఖం బొ ♦ సంగుగాత!
ధరణి నీకృతి యాచంద్ర ♦ తారకముగ, నిర్మలభవద్యశంబుతో ♦ నిలుచుగాత! ౭

గీII జనచయంబు భవత్కృతి, జదువుచుండి, సమధికంబై తనర్చెడు ♦ శంభునికృప
నాయురారోగ్యయుక్తమై ♦ యనవరతము, నున్నతానందమును బొందు ♦ చుండుఁగాత!

గీII అనుచు ముదిగొండ నాగలిం ♦ గాహ్వయుండు, రసికజనతాతిహృద్యమై ♦ యెసఁగు నాంధ్ర
శివపురాణంబుగూర్చి ♦ విశేషమైన, తనదు నామోదముందెల్పె ♦ దద్ జ్ఞులలర.

**4-3-1947**

---::O::---

శ్రీమహామహోపాధ్యాయాద్యనేక బిరుదాంచితులు ఆంధ్రభారత కవులు
బ్రహ్మశ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రులవారు కవిసార్వభౌములు -

బ్రహ్మశ్రీ ముదిగొండ నాగవీరయ్య శాస్త్రిగారికి -

అయ్యా! మీరచించిన గ్రంథమంతయుఁ జదువఁ జాలనైతిని. అక్కడక్కడ గొంచము కొంచముగా జదివితిని. కవిత్వము మిక్కిలి చక్కగా నున్నదని మనవి చేయుచున్నాను. మీరు కవితావిషయములో గొప్ప శుశ్రూష చేసియున్నారు. తత్ఫలితముగా నిట్లు సుకవిత్వ మలవడినదని పండితులు తలంచు చున్నారు.

**1-3-1947**
రాజమహేంద్రము

---::O::---

శ్రీతిరుపతి వేంకటేశ్వర ప్రాచ్యవిద్యాపీఠ ప్రధానోపాధ్యాయులు,
సంస్కృతాంధ్రవాఙ్మయ పరిశోధకాగ్రణులునగు
బ్ర॥శ్రీ॥ వేటూరి ప్రభాకరశాస్త్రులవారు.

* * *

ఆర్య! మీచే రచిత ప్రకటితమైన శివపురాణము నందందు హాయిహాయిగా యానందించినాను. మీ ప్రజ్ఞను జిరకాలము డాచియుంచుకొని పరితృప్తి పరచుకొ గ్రంథమును రచియించితిరి. శ్రీగురుపాదులు వెంకట శాస్త్రిగారును, మిత్రులు గుణ పరాయణులు సత్యనారాయణ కవిగారును మెచ్చుకొన్న మీ గ్రంథమును నాబోటివాడు సిద్ధసాధనము. తదా పీదమస్తు.

మీ గ్రంథము మహాగ్రంథము. మీరు మహాకవులు. గ్రంథ యోగ్యతకు దగి యోగ్యత గలవారు మీరు. మీరచనారీతి మంచి పురాణఫక్కిని సాగినది.

కుమారసంభవాది సంస్కృతాంధ్ర ప్రాచీనకృతులలోని శివకథలు మీపురాణములో ప్రాచీనకవులీ శివపురాణమును జాల సంగ్రహించి తమకృతులందు వినియోగించు మీగ్రంథ మేతత్పురాణ ప్రయోజనమును సర్వవిధముల నాంధ్రులకు సమకూర్పగలిగిం నిర్దుష్టము గుణబహుళమునగు మీరచన శ్రీ వేంకటశాస్త్రి గారి రచనపు బోలికలు గ వేడ్కగొల్పినది.

తీరిక లేమిచేఁ బర్యాప్తముగా జదువుటకును బరితృప్తి తీర సవిమర్శముగాఁ బ్రశం కును జాలకున్నాను. క్షమింపుడు.

1-3-1947

శతావధానులు బ్రహ్మశ్రీ వేలూరి శివరామశాస్త్రులవారు

* * *

అయ్యా! తాము వయస్సుచేఁ గనిష్ఠులయ్యు గుణములచే జ్యేష్ఠులు. తా మీ శివపు రచించి గురువులను బుత్రవంతులుగను, గురుపుత్రులను భ్రాతృమంతులుగను జేసినం మిమ్మభినందించుచున్నాను. అది యటుండె. శ్రుతులపిదపఁ బురాణము భాండారములు- తాము వాని తలుపొకటి చక్కఁగా తెరచితిరి. చిత్తగింపవలయును.

13-3-1947

---::O::---

## శ్రీభోగేశ్వర సత్యవత్యుపాఖ్యానాది మహాకావ్య నిర్మాతలు బ్రహ్మశ్రీ మల్లంపల్లి మల్లికార్జున శాస్త్రులవారు

* * *

### ఆశిస్సు

ఆర్యా॥ముదిగొండ నాగవీరే। శ్వరకవికృత శివపురాణ కావ్యమిదం
జీయాదారవిచంద్రం। కవిజన పరితోషలాలనాసాంద్రం. ౧

మ॥ కవితాచార్యుఁడు వేంకటేశ్వరు పరిష్కారమ్మునుంగాంచి, పైఁ
గవిసమ్రాట్టు సువర్ణ పీఠమును సింగారించు, మీ మాతృభ
క్తి విశేషమ్మరుదారనిట్లు పొడవై దీపించు నీకావ్య మాం
ధ్రవధూటీశుభకర్ణ పాశసుమసౌందర్యమ్ములం దిద్దుతన్. ౨

శా॥ శైవుండై జనియించినందులకు నీ జన్మమ్ము సార్థమ్ముగా
దేవుండిచ్చు కవిత్వశక్తి జననీ దివ్యాంఘ్రి సంసేవనన్
దావుల్గూర్చి వెలార్చితీ శివపురాణమ్ముం గవుల్మెచ్చ, మే
ధావిగ్రామణి! నాగవీరయకవీ! ధన్యుండ వీవెంతయున్. 3

**23-2-1947**

---::O::---

## శ్రీకాంచీమాహాత్మ్యాది గ్రంథరచయితలును. ఉభయభాషాప్రవీణులును నగు బ్ర॥శ్రీ॥మల్లంపల్లి వీరేశ్వర శాస్త్రిగారు.

* * *

### అభినందనము

శా॥ మామాతామహవంశ్యుఁ డేయనిన సమ్మానమ్ము, నారాధ్యభూ
సామాన్య మ్మభిమాన, మద్యతనతా సంకోచ భావమ్మునన్
బ్రేమమ్ముల్ విడనాడి మీకృతి నెడల్ వీక్షింపఁగా, నాంధ్రభా
షామంజీరరవానుకారియగుచుల్ సంతోషము ల్గూర్చెడిన్. ౧

మ॥ కలడా శైవులయందు నేడును మహాకావ్య క్రియాదక్షు, కో
మలభవ్య ప్రతిభాభిరాముఁ డని వేమాఱున్ విచారింప నీ
విలసద్భావగభీర, మీరసగుణాన్వీతమ్ము, నానాజనుః
ఫల మీకబ్బము దెల్పె నీ ప్రమథ భావమ్మున్ గవి గ్రామణీ! ౨

ఉ॥ కవులబుణమ్ము దీర్చి కొనఁగల్గిన, నిన్నొకపాటివానిఁగాఁ
గవియన రాదుగాక, శివకావ్య కథాకథనాధురీణునిన్
గవియనఁ జెల్లదే? బిరుదు కైకొన నొల్లని నీవినీతికిం
దవునిది నాగవీరయబుధప్రవరా! సుకవీ! మహాకవీ! 3

23-2-1947

---::O::---

ఆంధ్రవిశ్వకళా పరిషత్ప్రధానాచార్యులు, సౌందరనందాది కావ్యనిర్మాతలు
బ్ర॥శ్రీ॥ పింగళి లక్ష్మీకాంతకవి ఎం.యే. గారు

* * *

మీ గ్రంథము నామ మాత్రమున పురాణమే కాని రచనలో కావ్యమువలె నున్నది. అనగా పురాణోచితమైన ప్రసన్నధారాళతయు కావ్యోచితమైన రసదీప్తియు కలవన్నమాట. గ్రంథము చదివి నేను చాల ఆనందించితినని వ్రాయుట పునరుక్తి.

25--2-1947
వాల్తేరు

---::O::---

విద్వత్కవిరాజ, కవికులశేఖర, ప్రాచ్యసాహిత్య విద్యాప్రవీణ
బ్ర॥శ్రీ॥సరిపల్లి విశ్వనాథశాస్త్రిగారు, ఎం.ఏ. ప్రొఫెసర్ నిజాం కళాశాల, హైద్రాబాద్.

* * *

అభినవపోతన శ్రీముదిగొండ నాగవీరేశ్వర కవీంద్రుని శివపురాణకృతి:

మ॥ శివపారమ్యము భక్తి సత్కలిక లక్షీణంబుగా నిండఁగాఁ
గవితావాహిని కావ్యకల్పకముగాఁ గల్యాణనిత్యోత్సవ
మ్మవలీలన్ హృది నింప పోతన మహోద్యాన ప్రసూనమ్ములన్
శివభావ మ్మతి మాధురీరుచుల వాసింగన్న సత్కావ్యమీ

గీ॥ శివపురాణ ముదారము నవ మతులము, నాగవీరేశ్వరుకృతిఁ గనంగ నుర్వి
గుణసమంచితము హితమ్ము గురుతరమ్ము, పోతనార్యుడెఁ నాగేశుఁ డీతఁ డరయ.

ఉ॥ భక్తి విరక్తి లోకహితవర్తన నిర్మల శైవదీక్ష వాక్
శక్తి రసైక దక్షతయు సారవిశాలనవార్ద్ర భావముల్
యుక్తియు నచ్ఛశిల్పము మహోదయమై తగు మీదుకావ్య మా
ముక్తికి భుక్తికిన్ దగిన మూర్తి రచించితివో కవీశ్వరా!

8-3-1947

---::O::---

# విద్వదభిప్రాయములు
## (ద్వితీయ ముద్రణము)

* * *

ఆంధ్ర విశ్వకళాపరిషచ్చరిత్రాధ్యాపకులు
బ్రహ్మశ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారు, వాల్తేరు.

* * *

శివసంబంధమైన కథలతో శివపారమ్యమును బోధించి శివభక్తి నుద్దీపింపఁ జేయు నీయుద్గ్రంథమును రచించి శైవమతావలంబకు లందఱి కృతజ్ఞతకుఁ బాత్రు లైనారు. ఇటీవల ప్రకటితమైన తెలుగు శైవవాఙ్మయమున అంతేకాదు ఆంధ్రవాఙ్మయమ్మునందే ప్రధానస్థాన మాక్రమింపఁ దగిన మహాగ్రంథ మిది. ఈ పురాణమును రచించి ఆంధ్రవాఙ్మయమునకే వన్నె కూర్చినారు. సంపూర్ణముగ శివకథాసంహిత యనఁ దగిన ఈ శివపురాణమును ఆంధ్రీకరించిన సుకృతులు మీరే యనుకొందును.

ఈ పురాణ మంతయు నొక యమృతధుని. ప్రతిపద్యము నొక రసాత్మక తరంగము హృద్యమై యలరుచున్నది. శబ్దార్థగాంభీర్యముతో గౌరవోదంచితమైన శేవితో నిండలి కవిత్వము రమ్యముగా సాగిపోయినది. ఈపురాణము మధురమైన ద్రాక్షాపాకములో బడి చదివినకొలఁది జవు లూరించు చున్నది. ఇది ప్రాచీన ప్రబంధ ఫక్కి నడచి స్వతంత్రగ్రంథ మనిపించుచున్నది. కాని ఆంధ్రీకరణ మనిపించుటలేదు. నట్టుసొట్టులేని చక్కని ధారతో పటిష్ఠమైన సంస్కృత సమాసజటిలతతో భావానుగుణమైన శబ్దార్థపుష్టితో మనోహరమైన శైలితో గ్రంథ మంతయు మురువు గొలుపుచున్నది. ఇట్టి గ్రంథమును రచియించి నందుకు మిమ్మభినందించుచున్నాను. మీ కివే నాజోతలు.

**8-3-58**

---::O::---

శ్రీశైవమహా పీఠాధ్యక్షులు విద్వచ్ఛిరోమణులు
బ్రహ్మశ్రీ ముదిగొండ వీరేశలింగ శాస్త్రులవారు ప్రిన్సిపాల్,
శ్రీవిశ్వేశ్వర ఓరియంటల్ కళాశాల, వరంగల్.

* * *

అష్టాదశ మహాపురాణములలో శివపురాణ మొకటి. ఇట్టి మహాపురాణము సులభశైలిలో బండితపామరుల కెల్ల రుచించునటుల ఆంధ్ర భాషలోనికి పరివర్తించిన మహాకవులు శ్రీలోకారాధ్యులు ముదిగొండ నాగవీరయ్య శాస్త్రులుగారు.

ఇందలి ప్రతిపద్యము సాలంకారము సాభిప్రాయముగ నుండుటయే గాక కథాసందర్భ సంఘటన మత్యంతరమణీయముగా నున్నది. పంచ లక్షణలక్షితమై సలక్షణముగ సులలిత రీతులచే సహృదయుల హృదయము నాకర్షించుచున్నది.

శివస్వరూపమహిమా చరిత్రజిజ్ఞాసులకు నింతకంటే ఉత్తమగ్రంథము లేదు. శ్రీశాస్త్రి గారు ద్రాక్షాపాకములో సుకవిలోకమును మెప్పించిన తమ పేరును సువర్ణాక్షరములతో కవీంద్రమునశ్శిలాశాసనముల నంకితముచేసి యాంధ్రభాషాజనని యాశీర్వచనపాత్రు లయిరనుట యత్యుక్తిగాదు. అతిశయోక్తి గాదు. శాస్త్రిగారి కవిత్వము గంగా ప్రవాహమువలె నడచుచు తుదివరకు పాఠక హృదయములను తన వెంట గైకొని పోవుచున్నది.

**18-3-1958**

---::O::---

## బ్రహ్మశ్రీ దేవులపల్లి వెంకటకృష్ణశాస్త్రిగారు, హైదరాబాదు

* * *

పెద్ద గ్రంథాలు వ్రాయడానికిగాని చదవడానికి గాని ఇవి కానిరోజులు. లోకంలో మహావేగ మనేది ఒకటి వచ్చి పడింది. నిలకడా, శాంతి లేదు. మానవుని జీవితయాత్ర కొక గమ్యస్థాన మున్నట్లు కనిపించదు. ఏనిముషాని కానిముషమే బ్రదుకడంతో సరిపోతూ ఉంటుంది. ప్రజలలో ఆస్తిక్యబుద్ధి తగ్గిపోవడమే దీనికి మూలమేమో! ఏ భాగవతమో రామాయణమో పుచ్చుకొని చదవమంటే పాతపురాణం పోనిద్దూ అని పెదవి విరుస్తారు. అంతటి ఓపికలేదంటారు.

ఈ శివపురాణం శ్రీముదిగొండ నాగవీరయ్య శాస్త్రులవారు రచించినారు. వీరి సాహసము దీక్ష శివభక్తి సామాన్యమైనవికావు. పేరుకోసమో ప్రతిష్ఠ కోసమో రచించిన గ్రంథంగా కనిపించదిది. కవిననే బడాయి కనిపించ దెక్కడా ఈగ్రంథములో. శివు డుద్బోధిస్తుంటే కవి ఏమి చేయఁగలడు? సద్భావముతో ఈకృతి చేశాడంతే. మరిన్నీ 'భాస్వరవిభవేష్టలింగగతభక్త్యతి మాత్ర పవిత్రగాత్రుడును గురుజనపూజనోత్సుకుడును కుత్సితలోకపరాఙ్ముఖాత్ముఁడు' న్నూ ఈ కవి. అంతే కాక వీరితండ్రిగారు ''చాల కవనమ్మునఁ బ్రేమముఁజెంది కావ్యమొం డోజ గ్రహింప నెంచె''. మున్ను పోతన్న భాగవతం రచించి భగవంతున కంకితమిచ్చాడు. పింగళి సూరన్న పితృఋణముక్తికై తండ్రికి కావ్య మంకితం చేసాడు. తల్లిదండ్రులకన్న ఇతరము పరము లేదు. కనుక ఈ సుకృతకృతిలో ఒక అశ్వాసము తండ్రికి మరోటి తల్లికి సమర్పించాడు. ఇటువంటి మహాపురాణాలు కథా ప్రధానాలు కావటంవల్ల ఆ కథన్ను ధారాళంగా ప్రసన్నంగా స్పష్టంగా చెప్పగలిగి ఉండాలి. ఆ చెప్పే పద్ధతి మనోహరంగా కూడా ఉండాలి. పార్వతీబాల్య క్రీడావర్ణనం ప్రభాతవర్ణన ఘట్టాలలో కవి అవలంబించిన సంయమమాన్ని పరిశీలించగలరు.

గీ॥ ప్రబలసింహంబులను గొంతుఁ ♦ బట్టి లాగి, తెచ్చి యెక్కి వనం బెల్లఁ ♦ దిరుగుఁ గాళి
గున్న యేనుఁగుఁ గొనివచ్చి ♦ కొమరుఁడనుచు, నెత్తికొని ముద్దిడును బ్రియం ♦ బొసకమెసగ.

సీ॥ జనని నే నీఁక నాదు ♦ సంతాన మీరని, పండ్లోగిరంబులు ♦ పంచిపెట్టు
జగము లేలెడు దొర ♦ సాని నే నీరలు, ప్రజలంచుఁ బరువొప్పఁ ♦ బనులు సెప్పు
కామధేనువు నేను ♦ గడమ సురభు లీర, టంచుఁ గోర్కులను యో ♦ జించితీర్చు
కల్పవల్లిని నేను ♦ స్వల్పలతలు మీర, లని నిజౌన్నత్యంబు ♦ నమరఁజూపు

గీ॥ గురుగు లమరించు బ్రహ్మాండ ♦ గోళము లని, బొమ్మలను గూర్చు హరిపద్మ ♦ భువు లనుచును
బంతులాడును రవిహిమ ♦ భాను లనుచు, శైలరాజకుమారి శై ♦ శవము గూరి.

సీ॥ బాల విపంచికా ♦ వాదనం బొనరించుఁ, బరమేష్ఠిరాణి సం ♦ బరముఁజెంద
కాళి గాత్రమున రా ♦ గముల నాలాపించు, నిందిర హృదయంబు ♦ డిందువడఁగ
లలిత నర్తనకౌశ ♦ లంబుఁ జూపించు న, వ్విద్యాధరాంగనల్ ♦ వెఱఁగుఁ జెంద
శివ చిత్రము లిఖించుఁ ♦ జెలువుగా వలరాజు, రాణి ధైర్యంబు గ ♦ రంబు సడల

తే- గీ॥ అనుపమానమనోజ్ఞగా ♦ వ్యంబు లల్లు, నల్లగురుకావ్య దేవులు ♦ డిల్లపడఁగఁ
బరమకల్యాణి గిరివరే ♦ శ్వరకుమారి, లీల లేమని లెక్కింపఁ ♦ బోలు నెలమి.

(పా.ఖం.1-163,165,170)

క॥ ఉవ్విళ్ళూరుచుఁ బతికై, నెవ్వగఁ బాసికొని సుఖము ♦ నెక్కొనుతఱి లేఁ
బువ్వుంబోండ్లకు వెగటుగఁ, జివ్వునఁ దెలనయ్యె దెసలు ♦ చెలువలరారన్.

క॥ బిగువైన మగలకౌఁగిళు, లఁ గడున్ సొలపొందియున్న ♦ లలనలు నెట్లో
వగతో వదలిచికొని యి, మ్ముగఁ బడకగదులను బాసి ♦ పోయిరి వేగన్. (పా.ఖం.5.192,193)

ఆ యీ వర్ణనల యందు నన్నయాదిపూర్వకవిమార్గాలను స్ఫురింపజేస్తూ ఉంటారు వీరు. ఈ గ్రంథం శివపారమ్యాన్ని చెప్పేదికావడంవల్ల కవి ఆరాధ్య శైవుడు కావడం వల్ల శివమహిమాభివర్ణనాదులు చేసే ఘట్టాల్లో ఈకవిరచన తన్మయత్వావస్థను పొంది పోతన్నను స్ఫురింప జేస్తూ ఉంటుంది.

ఆంధ్రమహాకవుల మార్గాలన్నీ క్షుణ్ణంగా తెలిసినవాడు కావటంవల్ల ఈకవి పూర్వుల ఆంధ్రీకరణ పద్ధతులను చక్కగా గ్రహించి తన ఆంధ్రీకరణం మక్కికి మక్కి కాకుండా లలితంగా నిర్వహించడం మెచ్చదగింది. ప్రతిపాద్యవిషయం శివభక్తి. కవి శివభక్తుఁడైన ఆరాధ్యుఁడు. కవిత్వము కథా గౌరవానికి తగినదీ కావడంవల్ల ఈ గ్రంథం సర్వవిధాల గణనకెక్కుతుం దనేది నిర్వివాదం. నాగవీరయ్య శాస్త్రులవారు పితౄణముక్తినీ శివానుగ్రహాన్నీ సంపాదించుకోవడమే కాక లోకానికీ ఆస్తిక్యాన్ని కూడా ప్రసాదించి ధన్యత నార్జించుకొన్నారు.

ఆకాశవాణి
హైదరాబాదు.

---::O::---

శివభారతకర్త : కవిసమ్రాట్టు బ్రహ్మశ్రీ గడియారము వెంకటశేషశాస్త్రిగారు,
ప్రొద్దుటూరు.

* * *

## శ్రీశివపురాణ మహాకృతి ప్రశంస

చ॥ జయము శుభమ్ము మీకగుత! సంతతశాస్త్ర పురాణ సంహితా
ధ్యయన పరా! ప్రసన్న కవితావర! శ్రీముదిగొండ నాగవీ
రయ విబుధోత్తమా! శివపురాణముఁ దావకమున్ బఠించి వి
స్మయ కుతుకోర్మి ఖేలన వశంవదమై మది పల్లవించెడిన్ ॥ 1

క॥ ఒకచేత నింతగ్రంధము। సకల పురాణేతిహాస సారము, పురుషా
ర్ధకలా కలాపపూరం। బకలంకము వ్రాయఁదరమె యన్యకవులకున్॥ 2

ఉ॥ వ్యాసుని ప్రౌఢసూక్తు లనువాదము సేయుట గొప్ప నైకవి
న్యాసములై నవాని నొక యాంధ్రమహాకృతిగాఁ గవిత్రయో
పాసిత రీతులన్ బొదుగు టబ్రము మీకృతియో స్వతంత్ర కా
వ్యాసమశోభలన్ సహృదయ స్పృహణీ యరుచుల్ వెలార్చెడిన్ ॥ 3

ఉ॥ వేదములన్ బురాణముల విశ్రుతముల్ బహుధర్మకర్మ సం
వాదము లెల్లఁ బల్కి, యలవాని పరస్పర తారతమ్య సా
మ్యాదుల వింగడించి, 'యిదియంతయు నీశ్వర భక్తి యోగ సం
పాదితమై వెలుంగు' ననుపాకము మీకృతి మూఁదలించెడిన్॥ 4

క॥ శివదైవ మిట్టిఁ డనుచున్, శివతత్త్వం బిట్టిదనుచు శివలీలా వై
భవ మింత దొడ్డదనుచున్, సవిశేషము పల్కినీదు సత్కృతి సుకృతీ! 5

ఉ॥ కేవల ధర్మరూఢిఁ బలికించుట గాదిది, వాఙ్నిరూఢి శా
స్త్రావగతార్ధ వాద మెనయన్ వివరించుటగాదు; శైవగా
ధావలిలో సుధారసమునుండి కధా కధన ప్రసక్తి మో
దావహ కావ్యభాషఁ బురుషార్ధములన్ వెలయించుటంతయున్
సావయవాభిరామ మగునట్టు లొనర్చితి వయ్య! యీకృతిన్॥ 6

చ॥ సరళత నిండుగా వెలయు శయ్య, సమర్ధ పదప్రయోగ చా
తురి, తతసంస్కృతాంధ్రములతో సరితూఁగిన కూర్పుతీర్పు, భా
సురనవభావ కల్పనలు సూటిగ నచ్చునఁ బోయఁ జాలు నే
ర్పరితన- మింతయున్ శివపురాణమునం దభిరామమై తగున్ ॥ 7

శా॥ నానాదివ్యకథాఢ్యమౌ శివపురాణం బం దుమా శర్వ ము
ఖ్యానేక ప్రణయానుబంధచరితోద్య న్నాయికా నాయక
స్థానీయుల్ గల ధర్మశీల గుణవర్తుఁ వారిఁ జిత్రించుచోఁ
దేనెల్ నింపితి వన్నిపాత్రలను భక్తిన్ రక్తి సారించుచున్ ॥ 8

ఉ॥ కావ్యముగాఁ బురాణకృతిగా నితిహాసముగాఁ బ్రబంధతా
స్తవ్యముగాఁ దదీయగుణసంపదలన్ వెలుఁగొంది, సాదర
శ్రావ్యతమించు మీశివపురాణమునన్ దనుపొంది, పద్య ర
త్న వ్యపదేశమైన యభివందన మిట్లొనరింతు సత్కవీ! ॥ 1-7-1959

---::O::---

## శ్రీమహోపాధ్యాయ సాహిత్యాచార్య
## సాహిత్య సమ్రాట్ కవీంద్ర స్వామి శివశంకరశాస్త్రిగారు.

* * *

శివపురాణము అష్టాదశ మహాపురాణములలో అంతర్గతమైనది. గీర్వాణ వాణిలో ఇది **24** వేల గ్రంథము. ఆంధ్రములోని కీ పవిత్ర కోశము పరివర్తనమైనచో బాగుండునని తలచెడివాడను. ప్రకృతానువాదకర్త శివశ్రీ ముదిగొండ నాగవీరేశ్వర శాస్త్రిగారు దీనిని రచించుటకు సర్వథా అర్హులు. జన్మతః వీరు ఆరాధ్య శైవులు; శివభక్తులు. శైవసంప్రదాయము అనూచాన సంపదగా గలిగి ఉత్తమ గురువులకడ విద్యలభ్యసించి సలక్షణమైన కవిత్వము చెప్పగలిగినవారు. నిజ జననీ జనకులయెడ భక్తి యుక్తులైన శాస్త్రిగారు తమ రచనను తల్లిదండ్రులకే అంకితముచేసి ధన్యులైనారు.

ఇందలి భాష నిర్దుష్టము సరళము. శైలి సుదీర్ఘ గ్రంథమున కనువయినది. కావుననే పఠనలో నెచ్చటను విసువు పుట్టదు. ఇందు కొన్ని యెడల శబ్దార్థాలంకారములు కొన్ని యెడల గర్భకవిత్వము గోచరించును. వర్ణనములలోను సంభాషణలలోను కవిచాతుర్యము కానవచ్చును. ప్రసిద్ధములైన వృత్తములను అనువాదకర్త సమర్థతతో నడిపినారు. కథాసంధికై కల్పించిన వచనభాగములు కూడ హృద్యముగా నున్నవి. సందర్భానుసారముగా కావ్యకళ సువ్యక్త మగుచున్నది. ఈ పవిత్ర గ్రంథమును సంపూర్ణముగా సంతరించిన శాస్త్రిగారు కృతకృత్యులు. – శివ

**1-8-1958**
సాహితీ సమితి, ఒంగోలు

---::O::---

శ్రీలోకారాధ్యులు బ్రహ్మశ్రీ కవిశిరోమణులు ఇవటూరి సానందారాధ్యులుగారు

* * *

శ్రీశివాయ గురవేనమః

ఉ॥ శ్రీపరమేశ తత్త్వమును । జెప్పుటయందు సమర్థులైనయా
శ్రీపతి వ్యాసరూపమున । చెప్పినయట్టి పురాణరాజిలో
దీపితమైన శైవమను । దివ్యపురాణము నొక్కదాని సం
స్థాపనసేయ నాంధ్రమున । శర్వుడు నీకిడె గొర్కె వేడ్కతోన్ ॥ 1

ఉ॥ రంజనసేయగా శివపు । రాణము చక్కని తెన్గుబాసలో
మంజుల సత్కవిత్వమున । మక్కువతో రచియించి పాపపున్
భంజన మాచరించితివి । పండిత వర్యులు మెచ్చ బాపురే !
యంజలి జేతు నీ ప్రతిభ । కార్య సమాదరణీయ వైభవా ! 2

ఉ॥ ఈశ్వరు బూజసల్పి పర । మేశ్వరు సత్కరుణార్ద్రదృష్టి సూ
రీశ్వరులెల్ల మెచ్చ రచి । యించితి శైవపురాణరాజమున్
విశ్వజనుల్ నుతింప సుక । వీశ్వరులెల్ల గణింప నాగవీ
రేశ్వర శాస్త్రివర్య ! వచి । యింతు నిజంబు నిజంబిదే సుమీ ॥ 3

చ॥ అభినవ పోతనాఖ్యుఁడని । యందరు నిన్ను నుతింప భక్తిస
ద్విభవము జూపి యాంధ్రమున । దివ్యపురాణము వ్రాసి శూలి స
న్నిభుఁడితఁడంచు సజ్జనులు । నిత్యము నిన్ను గణించునట్లు ధీ
ప్రభలు వెలుంగ గ్రాలితివి । పండితవర్య! నిజంబిదే సుమీ ॥ 4

సీ॥ మొదట భారద్వాజ । మునివరుం డేవంశ, మునకు మూలం బౌచు । ఘనతజెందె
మహితోద్భటారాధ్య । మహనీయుఁ డే వంశ, జలధికి జంద్రుఁడై । వెలిగె మున్ను
వీరభద్రారాధ్య । విఖ్యాత నాముఁడే, కులవార్థి విధుఁడౌచు । వెలసెఁ దొల్లి
శశిమౌళిభక్తుఁడై । శంకరారాధ్యుడే, వంశాబ్ధి సోముఁడై । వన్నెకెక్కె 5

తే॥ నాగలింగాది సత్య విజ్ఞాన ధనులు
జనన మొందిన ముదిగొండ జలధియందు
పుట్టినాఁడవు నీపూర్వ పుణ్యవశత
నాగవీరార్య! సత్యవిజ్ఞాన ధుర్య! 6

**1-1-1964**

మచిలీపట్టణము

---::O::---

## బ్రహ్మశ్రీ యామునజాల పద్మనాభస్వామిగారు, మద్రాసు

* * *

### (ఆంధ్రభూమి నుండి) 22-1-1961

మహాభాగవతము అనువదించిన పోతనామాత్యుని వలెనే శివపురాణం తెనుగు చేసి శ్రీనాగవీరేశ్వరులు చరితార్థు లయ్యారు. శివపురాణము భాగవతాది పురాణ సముదాయంలో ఒకటి. ఈ పురాణములోని కథలే కాళిదాసాది మహాకవులకు - కావ్యాలు వ్రాయటానికి, పునాదు లయాయంటే అతిశయోక్తి కాదు.

ఇది యింతవరకు ఎవరిచేతా తెనుగులోనికి చంపూ ప్రబంధంగా అనూదితం కాలేదు. పోతనామాత్యుల వారి చేతిలోనే మహాభాగవతము రూపొందినట్లు, శివపురాణము నాగవీరేశ్వరుల వారివల్ల తెనుగు ప్రబంధరత్నమై ఆంధ్ర వాఙ్మయమకుటానికి గరుడపచ్చ అయింది.

శివపారమ్యాన్ని సమగ్రంగా తెలిపే మహాపురాణం శివపురాణం. గాధ పౌరాణికమే అయినా ప్రతిభాశాలియైన కవిచంద్రుని సహజ కవితా పాండిత్య ప్రతిభా భాసమానమై, ప్రాచీనములైన ఆంధ్రకాశీఖండాదులకు దీటుగా, రూపొందింది ముదిగొండవారి కవిత. ఈ రచనలో పోతన్నగారిని, శ్రీనాథుణ్ణి సమపాలుగా అనుసరించింది.

ఈ రోజుల్లో ఈలాటి మహాపురాణం అవతరించటం ఒకవిధంగా జాతికి శుభోదర్కమా అని సంతోషించవలసి ఉంది. ఇంక ఆంధ్రానువాదం మహిమ చెప్పటం కొంత బాధ్యత నామీద ఉంది. ఈ మహాగ్రంథము చదివాక దీనిపై ఏమివ్రాయాలా? అనే సందేహం కలిగింది. ఎంచేతంటే ఇది సర్వలక్షణ లక్షితమైన పురాణ ప్రబంధం ........

'పురాణ ప్రబంధం' అని అంటున్నానంటే కొంతమంది నవ్వుకుంటా రనుకుంటాను.

'పురాణం - ప్రబంధం' యీ రెండింటికి ఉండే భేదం ఈ సమీక్షకుడికి తెలియదురా! అని. రెండు మూడు ఘట్టాల్లో రెండు మూడు పద్యాలు ఎత్తి వ్రాసి చూపుతున్నాను. అవధరించండి.

ముద్దుబిడ్డను పార్వతిని చూస్తూ హిమవంతుఁడు మురిసిపడుతున్నాడు.

చ॥ కలిమిగ మ్రాకులెల్ల నన కారు నెడన్ చిగిరించి పూచి తా
వుల విలసిల్లు చున్నను తవుల్కొను చూతసుమంబు నందు తే
టులు, కులశైల వల్లభుఁ డటుల్ కొడుకుల్ కడు నెక్కుడున్న ని
చ్చలు సుతనే [illegible] మొంది చెలంగు నెంతయున్.

(పా.ఖం. 1-161)

మన్మథుడు ఇంద్రునితో మాట్లాడుతూ తన ప్రభావం ఇలా చెప్పుకుంటాడు.

''క్షణమాత్రంబున మహిళే
క్షణ శృంఖలc గట్టివేసి గాసియొనర్తున్
రణరంగరిపువిదారణ
చణమగు కులిశం బదేల స్వల్పంబునకై.'' (పా.ఖం. 2-88)

ముక్కంటి కంటి మంటలలో మన్మథుcడు దగ్ధమయాక, రతి విలపిస్తున్న ఘట్టంలో

''అకట మహేశ! నీకుc దగు నాలును గూర్పcగ నామనోవిభుం
డకుటిలబుద్ధితో సుమచయంబును గుప్పిన యంత నీ విటుల్
వికట కృశానునేత్ర పరివృద్ధ కరాళతరార్చిc గాల్పc దా
వక హృదయంబునం దుచిత భంగిని గన్పడెcగా! పశుప్రభూ!
(పా.ఖం.2-144)

''మిమ్ము నాలుమగల మెలకువతో కూర్ప
వేడ్క సేయ నాదు విభుcడు; నీవు
మమ్ము నాలుమగల మఱి వేఱు చేసితే
దయనుబాసి కఠిన తరచరిత్ర!'' (పా.ఖం. 2-145)

ఇది సంస్కృతంలోంచి అనువదించిన గ్రంథంలా కనిపించదు. సార్థకములైన సంబోధనలు సరళమైన పదబంధం, ధారాళమైన శైలి, పెన వేసుకొన్న స్వతంత్రరచన, అని అనడానికి కావ్య రసా స్వాదనలో నిండిన మనస్సు కలవారు ఎవరున్ను సందేహించరు. అందుకే మొదటే అన్నాను నాగవీరేశ్వరకవిగారు పోతనామాత్యులవలె చరితార్థులయారని.

ఈ పురాణ ప్రబంధంలో చివరదైన విద్యేశ్వరఖండం శైవమతానుయాయులకే కాక సమచిత్తులైన వారికి అందఱికి అవశ్యం పఠనీయం. మధ్యమధ్యవచ్చే ఉపాఖ్యానాలలో కూడా కవిగారు కవితకే కాక వస్తువుకు కూడా తగినబలం ఇచ్చి ఉదాత్తంగా సంతరించడం సామాన్యకవికి అసాధ్యం అనిపించింది.

ఈ మహాగ్రంథం గొప్పతనం ప్రత్యేకంగా చెప్పవలసినవి రెండు విషయాలు - ప్రత్యక్ష దైవతములైన తలిదండ్రులకు అంకితం ఇవ్వటం, శ్రీవిభుcడు అనే పద్యం నుండి చివరవఱకూ సమానంగా, మాననీయంగా, గ్రంథం అనువదించటం.

---::O::---

# ప్రథమ ముద్రణము - గ్రంథకర్త మున్నుడి

* * *

శ్రీ శివాభ్యాన్నమః

శ్లో॥ అష్టాదశ పురాణానాం । కర్తా సత్యవతీ సుతః
కామికాద్యాగమానాంతు । శూలపాణి ర్మహేశ్వరః. (స్కాందపురాణ సూతసంహిత)

పరమకారుణికాంతరంగుండగు పరమేశ్వరుని యుద్బోధంబున జగత్కల్యాణము కొఱకై చెలికారుపునుడుల వ్యాసభట్టారకుండు రచించిన పదునెనిమిది మహాపురాణములలో మేలిమి మీఱు శివపురాణమును బ్రాచీనాంధ్ర కవివర్యులు మొదలుకొని నేటివఱ కలరు కవివర్యులెవరును బద్యరూపముగఁ దెనిగించకుండుట నాభాగధేయవి శేషము. నే నొకప్పు డొకరి యింటనున్న యీ శివపురాణంబును జూచి కొంచెము భాగము చదివి యానందించి తదాంధ్రీకరణేచ్ఛ యనివార్యంబుగఁ బొడమ నావాసరమందే పొత్తంబు నారంభమునొనర్చి యనతికాలంబుననే కొండొక భాగంబు దెలిఁగించి విజ్ఞులగు వారలకుఁ జూపెట్టఁగా నవ్వారు మురిసి నాయుద్య మంబున కూఁతయొసంగిరి. అంత నేనామోదముతో మఱికొంత రచించి శ్రీశ్రీ కవి చక్రవర్తులును నాగురులునునగు బ్రహ్మశ్రీ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రులవారు శతావధానుల వారి సముఖమునకేగి వారికి వినిచితిని. వారును విని యానందించి మఱికొన్ని విశేషంబులు నాకుఁ గఱపి యేతదాంధ్రీకరణ ప్రయత్నమునకుఁ బూర్తిగ నుత్సాహం బొసంగిరి. మొదటఁ గొన్ని ఖండంబులు మాత్రమే రచించి ముగించుద మనుకొని యట్లొకటి రెండుమారులు మధ్యమధ్యఁ జాలగాలము విరామంబొనర్చియు మహామహులగు కొందరి ప్రోత్సాహముతో నెట్లో శివానుగ్రహంబు బలిమితో నిప్పటివఱకు శివపురాణంబును సర్వంబు నాంధ్రీకరింపఁ గలిగినందులకు భక్తవత్సలుండగు శివునకును నిందు నాకు బ్రేరకులగు వారలకును జోతలొనర్చెదను. ఇఁక శివపురాణంబును గుఱించియు నాయాంధ్రీకరణంబును గుఱించియు నొకించుక ముచ్చటించెదను. శ్రీదేవీభాగవత ప్రథమస్కంధములోని

శ్లో॥ మద్వయం భద్వయం చైవ । బ్రత్రయం వచతుష్టయమ్
అనాపలింగ కూస్కాని । పురాణానా మనుక్రమ ః ॥

యనెడు శ్లోకోక్తి ననుసరించిన యష్టాదశమహాపురాణ పరిగణనలో నీ శివ పురాణము చేర్పఁబడక యుపపురాణములలోఁ జేర్పఁబడినందునఁ గొంద ఱిద్దాని నుపపురాణంబని యందురు. ఇట్లే భాగవత మన, దేవీభాగవతమే కాని శ్రీభాగవతము కాదని యా శ్లోకముయొక్క తాత్పర్యము. అందులకు శ్రీభాగవతవాదు లట్లొప్పుకొనరు. శ్రీభాగవతమే మహాపురాణం బనియు, దేవీభాగవత ముపపురాణంబనియు జెప్పుదురు.

శ్రీ భాగవతమందుఁగల మహాపురాణ పరిసంఖ్యలో శివపురాణము పేర్కొనఁ బడినది. శ్రీభాగవతే ద్వాదశస్కంధే సప్తమాధ్యాయే.

శ్లో॥ బ్రాహ్మ్యం పాద్మం వైష్ణవంచ । శైవం లైంగంచ గారుడం
నారదీయం భాగవతం । ఆగ్నేయం స్కాంద సంజ్ఞితం
భవిష్యద్బ్రహ్మకైవర్తం । మార్కండేయంచ వామనం
వారాహ మాత్స్య కౌర్మాణి । బ్రహ్మాండాఖ్యమితి త్రిషట్
బ్రహ్మన్నేతం సమాఖ్యాతం । శాఖాప్రణయనం మునేః॥

మఱి యందే ద్వాదశాధ్యాయమునం దష్టాదశ పురాణంబుల పరిమితియుఁ గూడ నిట్లు నిర్దేశింపఁబడియె.

శ్లో॥ బ్రాహ్మ్యం దశసహస్రాణి । పాద్మం పంచోన షష్టిచ
శ్రీవైష్ణవం త్రయోవింశ । చ్చతుర్వింశతి శైవకం
దశాష్టౌ శ్రీభాగవతం । నారదం పంచవింశతి ॥ ఇత్యాది

ఇట్లే స్కాంద పురాణ సూతసంహితయందు,

శ్లో॥ బ్రాహ్మ్యం పాద్మం వైష్ణవంచ । శైవం భాగవతం తథా॥ అని యుపక్రమించి --

బ్రహ్మాండంచేతి పుణ్యోయం । పురాణానా మనుక్రమః ॥ యనియు, నిట్లే విష్ణుపురాణము, కౌర్మము, మాత్స్యము, వామనపురాణము, లింగపురాణము మున్నగువానియం దష్టాదశ మహాపురాణ సంఖ్యలో శివపురాణము లెక్కింపఁబడినది. ఏ కారణముననో దేవీభాగవతమందు మాత్రము ''వచతుష్టయం'' బని వాయుపురాణంబును మహాపురాణంబుగఁగైకొని యీయది యుపపురాణములందుఁ జేర్చబడియె. ఆ వాయుపురాణముగూడ శివపారమ్య ప్రతిపాదకమే. బహూక్తి ప్రామాణ ప్రాబల్యంబునను, వైయాసిక శైలీ పరిజ్ఞాన పరిపాటీ విశేషంబునను శ్రీశివపురాణ మష్టాదశ మహాపురాణ మాలారత్నం బనియే విజ్ఞు లారయుదురని విశ్వసించెదను.

ఇఁక నీయది సంహితాభేదంబులతో రెండుతీరుల బలుకడల ముద్రింపఁ బడినది. అందుఁ బ్రధానములై శ్రీకాశీపట్టణ ముద్రిత గ్రంథం బొక్కడును, బొంబై పట్టణ ముద్రిత గ్రంథమొక్కడును గన్పట్టుచున్నవి. గ్రంథంబులు రెండును సాకల్యంబుగఁ జదివినపిమ్మట నొక్కటిగానే కన్పట్టును గానీ గ్రంథములలో నేదేని యొక భాగము మాత్రము జదివెడువారికి వేఱువేఱు గ్రంథములు రెండని దోఁచును. అందు నాకు మొదట దొరికినది బొంబై ప్రతి. అద్దాని ననుసరించియే పరివర్తనము చేసితిని. పిదపఁ గాశీప్రతిగూడఁ బరికించితిని గాని మార్పు చేయవలసిన యవసర మగుపడలేదు. ఇఁక నాపరివర్తనమందు

